# వీరసింహుఁడు

(అను)

## తెల్గు ప్రబంధము.

---

ఇది

ఆంధ్రవిశ్వకళా పరిషత్పండితుఁడగు

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిచే

రచియింపఁబడి ప్రకటితమైనది.



మొదటికూర్పు 1000.

1935

All Rights Reserved.

# విజ్ఞప్తి.

ఏతత్కథావస్తువునకాటపట్టగు: విజయనగరసామ్రాజ్యము, నళియరామరాయప్రభృతులుఁ, దల్లికోటయుద్ధవిప్లవమును మున్నగు విషయములెల్ల నిర్దుష్టచర్త్రితాంశములె. ఇంక వీరసింహుఁడను నాయకుఁడును మాల్యవతియను నాయికయుఁ దత్పరివారజనులును గల్పితపాత్రములు.

దైవమానుష శక్తులలో దైవశక్తి ప్రబలతరమని ప్రదర్శించుట యేతద్గ్రంథ పరమోద్దేశము. కార్యసాధన సామగ్రి పరిపూర్ణముగ నున్నను నొక్కొక్కప్పుడయ్యది భగ్నమై ప్రతికూలఫలము లభించుచుండుటయె యందులకుఁ బ్రమాణము. కావుననె లోకయాత్రాతత్త్వజ్ఞులగు పెద్దలీక్రిందిరీతిని వచించియున్నారు.

శ్లో॥ "అవశ్యంభావిభావానాం । ప్రతీకారోభవేద్యది ।
తదాదుఃఖైర్నలిప్యేర । న్నలరామయుధిష్ఠిరాః"॥

(వేదాంతపంచదశి)

ప్రాచీనయుగములలో నలరామయుధిష్ఠిరు లెట్టిమానుషశక్తిపరమావధిభూతులో నేఁటియుగమునందలి విజయనగరసామ్రాజ్యమును దాదృశశక్తిసంపన్నమె యని విశ్వసింపఁదగునుగదా! వీరసింహుఁడును నట్టి శక్తిసంపన్నుఁడుగనె యిందు వర్ణింపఁబడెను.

(ధర్మాదిరూప)

లోకయాత్రాప్రవృత్తిలో నుత్సాహశక్తి నిల్పకొల్పుట కయి ప్రాచ్యసాహిత్యతత్త్వజ్ఞులు సాధారణముగ ధర్మాత్మునకె విజయము గల్గించుటయు, దుశ్చర్య గల వానికె దుఃఖపర్యవసాయిజీవితమును సంభవింపఁజేయుటయు సర్వోత్తరమని తలంతురు. కాని యిది కొన్నియెడల స్వాభావికము కాదనుటకుఁ బైనుదాహరించినయనుభవమె ప్రబలప్రమాణ మగుచున్నది. సచ్చరిత్ర గలవారును నొకప్పుడు దైవవశమున నొకమార్గమునఁ బ్రవర్తించుటయుఁ దన్మూలమున వారిజీవితము దుఃఖపర్యవసాయి యగుటయు ననేకస్థలములం దగపడుచున్న దనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు గదా! ఈవిషయములనె విశదపఱచుచు దైవదుర్విపాకరూపవైషమ్యము సేవగించు నిర్విణ్ణుఁడగు కథానాయకుఁ డిట్లు విధివిధానముల నిరసించెను.

"హా దుర్విధీ తాదృశాప్రమేయకల్య
సుగుణకల్పకవల్లిసుదతీమతల్లి
సృజియించి తొల్తొన ఛేదింప నెట్లు
చేయాడె ! నీకు నౌచిత్యంబె కృపమె!
గాఢానురాగంబు గలిగింప నేల,
బంధుమిత్రుల నెడఁబాపంగ నేల;
రూపలావణ్యముల్ చూపింప నేల,
నైష్ఫల్యమున దాని నలఁగింప నేల;
గర్వదుర్వహాలక్ష్మి కలిగింప నేల,
చాంచల్య మిడి దాని సమయింప నేల;

విజయవిక్రమముల వెలిగింప నేల,
యపజయంబిడి దాని నడఁగింప నేల;
మతి దప్పి యిటునే విమర్శింతుఁ గాక !
వెడఁగుచెయ్వుల కింత విసుమాన మేల!
కల్పభూజముఁబోని కర్ణాటరాజ్య
మొకవేళ్ళల్మడిని నిట్లు పెకలింప లేదె!
రాజదేవాధీశు రామభూమీశు,
శత్రుదురాధర్షు శశ్వజ్జిగీషు,
నరిచేతి కందించి యడఁగింప లేదె;
అంకురించి చిగిర్చి యలరించి మిగుల
దీపించుమాల్యవతీవీరసింహ
రాగకల్పకవల్లి యీగతి న్విఫలి
తంబుగాఁగ జయధ్వజంబెత్త లేదె
కోటి కొక్కండేని కొనసాగె నయ్య!
పెరిఁగి తోడ్తోడనే విఱుగకుండంగ. ”

(౧౬౨౮—౧౬౮౬)

ఇంక శృంగారస్థాయిభూతరతిభావవిజృంభణావిషయమున విప్రలంభశృంగారవర్ణన మావశ్యకమె యనియు, ప్రేమపరమావధివియోగాసహనమూలకప్రాణత్యాగీకారమే యనియుఁ, బ్రాచ్యసాహితీసారధురీణులు సైతము తలంచినవారై యయ్యు, నాయికానాయకమరణవర్ణనము రసవిచ్ఛేదహేతువను కారణమున మరణప్రయత్నమును, నచిరాత్పునరుజ్జీవన[illegible]మరణ

మునుమాంత్రికు కరుణవిప్రలంభపరమావధులని పెక్కురభి ప్రాయపడుచువచ్చిరి.

"రసవిచ్ఛేదహేతుత్వా న్మరణం నైవ వర్ణ్యతే।
జాతప్రాయం తు తద్వాచ్యం। చేతసా కాంక్షితం తథా
వర్ణ్యతేఽపి యది ప్రత్యుజ్జీవనం స్యాదదూరతః"
(215 కారి)

"యూనో రేకతరస్మిన్, గతవతి లోకాంతరం పునర్లభ్యే।
విమనాయతే యదైక, స్తదా భవేత్కరుణవిప్రలంభాఖ్యః"
(సాహిత్యదర్పణము. 224 కారి).

"సవ్యాపసవ్యత్యజనాద్ద్విరుక్తైః। పంచేషుబాణైః పృథగర్జితాసు। దశాసు శేషా ఖలుతద్దశాయా। తయానభః పుష్పతుకోరకేణ॥" (నైషధకావ్యము)

కావ్యకళాదృష్టి నరసినపుడీ యభిప్రాయము సమంజసముగనే యగపడును గాని కొన్నియెడల నట్టివర్ణనము స్వభావాతిక్రమణమునఁ గృతకమై కాంతివిదూరమై సహృదయహృదయాకర్షణవ్యగ్రము కాక మానదు.

సీ. చనుఁగప్పు దోలఁగ వాసనగాలి కెమురు రేఁగుఁ
బరువొప్పనలుఁగులఁ బొలుకరణి
నిడుదవేనలినూనె ముడిపిడఁ జిగురాకుఁ
బొదఁదూఱుఁ గార్చిచ్చుఁ గదియు కరణిఁ
బసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోచి నునుఁదీగఁ
దెమలించు నరిత్రాడు నెమకు కరణి

మొలనూలు బిగియించి వెలఁది వెన్నెలఁ
జొచ్చుఁ బిఱుదీయ కేటిలో నఱుకు కరణి
తే. గీ. జడియుదళులకు గురియు పుప్పొడుల మునుఁగు
మావికడ నిల్చువిరుల నెత్తావిఁ గ్రోలు
విషమసాయకు సేఁపుల విసివి విసివి
తనువుఁ దొఱఁగంగఁ దలఁచి యవ్వనరుహాక్షి.

(మనుచరిత్రము. 3 ఆ 31 ప).

సీ. పవమానమానవప్లవమానకైరవ
చ్యవమానరజముమైనంట దివురుఁ
గరసారసాగ్రతామరసాతిసాంద్రసీ
ధురసాప్తిఁ గన్నీరుఁ దుడువఁ గోరు
మదనానలప్రభాసదనామ్రకోమల
చ్ఛదనార్చిపైఁ జూపు జరపఁ జూచు
సలయాహతలతాకిసలయాగమలయాగ
నిలయానిలున కూర్పు దెలుపఁ దలచుఁ
తే. గీ. గుంజపుటగుంజిదళిపుంజశింజితంబు
వెగ్గలంబైనఁ జెవియొగ్గివినఁ గడంగుఁ
బంచశరభూతపరిభూతపంచభూత
ములఁ దదీయస్థలంబులఁ గలుపు కరణి.

(వసుచరిత్ర. 3 ఆ. 118ప).

ఆదికావ్య మగురామాయణము సైతము సుఖపర్యవసాయి కాదు గదా! ఇంత యేల? కథావస్తువు సుఖపర్యవ

సాయి యైనను దుఃఖపర్యవసాయి యైనను ప్రబంధవ్యక్తమగుచు సహృదయాస్వాదయోగ్య మగుచున్నరస మఖండానందరూపమే గదా!

శ్లో. గుణాలంకారశ్రీకృతపరికరో భావవిభవః ।
స్ఫురత్ప్రాదుర్భావః క్రమగళితవేద్యాంతరమతిః ।
సుఖం వా దుఃఖం వా నిబిడయతు యూనోః ।
సహృదయేత్వమందానందాత్మా పరిణమతి పూర్ణోరసభరః.

(ప్రతాపరుద్రీయము. రసప్ర. ౧౦౩ ప).

ఉ. భావమలంక్రియాగుణవిభాసితమై వికసద్రసోదయ
శ్రీవినివారితేతరవిశేషనివేదనమై యెలర్ప నీ
వావిరి దుఃఖమైన సుఖమై భవమైన విటీవిటాళియం
దావలఁ బూర్ణమై సహృదయాత్మలఁ గేవలహర్షమై తగున్.

(నరసభూ. 3 ఆ. ౧౫౫ ప).

ప్రకృతకావ్యమున దైవవశమున నత్యావశ్యకముగను నుచితముగను బ్రవర్తించిన ప్రవర్తనముచేత నవర్జనీయ మగు ప్రాణత్యాగమునకు నాయిక లోనయి గాఢానురాగపరిపాకరూపనాయకస్మృతికి మూలమైనది. కావుననె వీరసింహాసంకల్పసోపాననిర్మూలనమూలకారణ మగునాత్మప్రవర్తనము నందలి న్యాయ్యత నిట్లు మాల్యవతి విమర్శించి తననిర్దోషితను వెల్లడించెను.

“ఏల చింత! వివేకమింతేని లేక
చిత్తమా తత్తరించెద వేల జేల !

అసువులం జవిఁ జూపి మసలించె దేల?
అర్కవంశోద్భవుండభిమానధనుఁడు
నిష్కళంకసుధాంశునీకాశకీర్తి
రారాజితుఁడు తిమ్మరాజమూర్ధన్యు
నాత్మజ చెఱ కేఁగుసంతటియసదె !;
ప్రాణంబు మిత్రికి బలిసేసి మాన
మును గాచికొనకింక వెనుదీసెదేల?

♦ ♦ ♦ ♦ ♦

పరికింప నిందు నానేరసేది? దైవ
దుర్విపాకం బిట్లు త్రుంగించెఁ గాక !
వింతలౌ వంతల న్వేఁగుచు నున్న
మజ్జీవితపుమోక నుజ్జీవితముగఁ
బచరింప ననురాగ పవమానసీత
జీమూతమై వచ్చి చెఱగవ్వారమునఁ
బడరానికడగండ్లఁ బడుచుజీర్ణించు
హృదయాధినాథు నుపేక్షింతు నెట్లు?
భాగ్యంబునం జేసి ప్రాణేశ్వరుండు
తురక వివేకించి తొలఁగించె నంచు,
బందివిమోచనమందు నా చేయు
జతనం బెఱుంగక సడికి వంచనకు
సంకోచ మందక సాహసంబంచు
నానిమిత్తంబునన్ శంకించి కొంచు,

నరులదేశంబందె యాలసింపకయ
యామోఘనోత్సాహిదై నన్ను మనిచి
శ్రీరామరక్ష సుస్థితినందఁ గల్గె.
ఆత్మేశ సంరక్షణార్థమై తనువు
వ్యయమౌచు ధన్యంబ యౌను వేయేల!
దైవంబ యీపట్ల దయ సూపితయ్యా!
విపరీతములు సేసి నెతఁ గూల్పకుండ.
ప్రాణేశు వంచించి యసువులన్వీడు

---

కొననౌనె యనినీకుఁ గొంకేల మనస?
మానరక్షార్థమై ప్రాణంబు తృణము
గాఁ జూచువారలం గాదె మన్నించు
శూరాగ్రసరుఁడైన వీరసింహుండు.

---

అని యంగుళీయాంకితాత్మేశనామ
మధురాక్షరము లైనమగటాలరవల
నమృతబిందులఁ బోలె నాని యాతన్వి,
యాత్మాపరాధసమాధానలేఖ
చెలులమూలంబునఁ జేరు నీశునకు
నంచు నీరీతి లిఖించఁగా సాగె:
జన్మజన్మములందు స్వాంతంబు నిన్నె
సేవించుఁ గావుతఁ జిత్తేశ్వరుండ;
కాంత నీయవ్యాజకారుణ్య మెప్పు
డీతపస్వినికిఁ జేయూఁతయౌఁ గాత;

కొఱనోము నోము నీనిఱు పేదతనువు
నినుఁ గూడు చరితార్థతను గాంచకున్నఁ
గలలయందును సమాధులయందు నిన్ను
భావించి తనివోవ సేవించి నీదు
కల్యాణగుణములం గాంక్షతో నెన్ని
కఱవు తీఱఁగ నీదుకారుణ్యగరిమ
మన్ననల్ గాంచియు మది ధన్య మయ్యె;
ఈమాత్రకోర్వలేకిటు మచ్చరించి
కనులనిప్పులు వోసికొనె దుష్టనియతి.
స్వాభీష్టసంసిద్ధిభంగంబు నరసి
పరిభవాపరిశుద్ధి పడయుఁగ వెఱచి
స్వాతంత్ర్యమును జూపవలసె నీమేన;
నపరాధములు సైపుమా వీరసింహా;......

(౧౦౩౯—౧౧౦౫).

ఔచిత్యపరిశీలనవిషయమున నభిప్రాయభేదములు పెక్కుగా నుండవచ్చును. రసాస్వాదలోలుపులగు పండితకవులిందలిగుణలేశములను స్వభావసులభ మగుప్రీతి నాదరింతురు గాక !

పరస్పరవిరోధము గలపాత్రముల ప్రసంగములలో విమతనిరాకరణధోరణి యుండుటయే స్వాభావికమగుటచే నీక్రింది రీతిగలయాయాపాత్రముల వాక్యములు శంకాస్పదములు కానేరవు.

‘‘అలియదిల్‌సా రేమి! యతని తలేమి!
రాయబారం బేమి! రామరాయండు
జాగ్రత్త పడుటేమి! చాలుసన్నారు’’ ౨౮౮ ము.
‘‘పిఱికిపందలు మల్కమొఱకుతేంట్లకును’’ (౯౭౬)
‘‘అకట దేవద్విజాంతకులచే ఘోర
గోఘాతకరపాతకులచేత మిగుల
నపవిత్రపఱుప నీయఁగనౌనె నేఁడు’’ (౧౧౬౦ ము)

ఇఁకఁ గవివాక్యములందట్టి యావేశములేని తాటస్థ్యమె గన్పట్టుచుండును.

‘‘సామ్రాజ్యవర్ధ నాశాపిశాచంబు
నావేశమేమి చేయఁగఁ జాలకుండు!
వేషభాషాజన్మవిషయసంబంధ
ముల విస్మరించి కేవలము వైజాత్య
వైమత్యముల వేఱుపడి పరస్పరము
మ్లేచ్ఛులంచును గాఫిరీలంచు నిట్టు
లన్యోన్యనిరసనాయత్త చేతస్కు
లన్యోన్యరాజ్యాపహరణేచ్ఛు లగుచుఁ
దురకలార్యులు నొక్కతరమువారిట్లు
క్షీణులై స్వాతంత్ర్యహీనులై దీను
లై నాఁడునాఁటికి నడఁగిరే కాదె!
కౌటుంబకలహానఁ జేటొందుటరుదె?

ఇంక నిందలివర్ణనములందును ఛాత్రోచితముగను సంద ర్భోచితముగను భారతీయులయు మహమ్మదీయులయు నౌత్కృష్ట్యము సరిగాఁ బ్రశంసింపఁ బడియెను.

"మినుమీఁదఁ బడె నన్నఁ దొనకింతలేక (౧౮౧౩)
విగ్రహంబులయందు వెనుకంజ లేక
యశమేని మృత్యువే నందునందనుక
సింగముల్ మత్తమాతంగకుంభముల
కుటికెడు మాదిరిఁ బెఱవరూధినుల
పైఁబడి నిజభుజాబలము చూపించు
భారతీయులు తేని పరులపాల్సేసి
పఱచిరే! యెపుడేని ప్రాణాశతోడ. (౧౮.౨౦ పా.)
చేయంగ విని వీరసింహులుఁ డుల్కిపడి (౧౮౭౬ పా.)
కనుఁగుండముల నగ్నికణములు రాలఁ
గంపోత్తరాంగుఁడై కలగుండు పడుచుఁ
దనువు దానెఱుఁగని తమకంబుతోడ
నటిముటి రిపులవ్యూహములందుఁ జొచ్చి,
విలయకాలములందు వీతెంచు నల్ల
సురగాలి రేఁగుచిచ్చుఱకంటికంటె
మంటనా జాజ్జ్వల్యమానుఁడై యేచి,
సురియతో నెదసించి శిరము వ్రచ్చియును,
గంఠంబుఁ దెగనేసి కరము ద్రుంచియును
పలకేల నొక్కని పలకాల నొకని

డాకేల నొక్కని డాకాల నొకని
నదిమియుఁ జదిపియుఁ గుదిచి, కూల్చియును,
బలుమాని సరకాలఁ జలిచీమపిండుఁ
జదిపినమాదిరి మదపుటేనుంగు
కమలాకరంబును గలఁచు కై వడిని,
సింగంబు లేళ్ళను జెనకుచందమున,
నాలమందల వ్యాఘ్రి మలఁచుతోయమునఁ,
బెఱసేన పీనుంగుపెంట గావించి
యేత్తెఱఁ జూపించు నెడనెట్ట యెదుట (౧౮౬౫)

---

బలుబొజ్జ మొకములం బొలియింపఁ జాలు (౨౦౧పా.)
పలితంబ యనఁబోలు తెలిజూలు వ్రేలు
తెఱనోటిమొకములం దెఱలింపఁ జాలి
గజవాజినృపతులం గవియంగ నొడు
గఱచుచుఁ గొర్కొను గడ్డముల్ నిగుడ
గుమిగూడు వింతైన కొదమసింగములె
యవు నుమ్మరావులు తవిలి సేవింప,
బిజపూరు దరినుండుబీడుల న్వడిసి
బీద రహమ్మదాబాదు గోల్కొండ
బీజాపురీశు లభిన్నులై చేరి
కర్ణాటసామ్రాజ్య కల్పవృక్షంబుఁ

గూఁకటివేఁటుతోఁ గూల్పంగఁ జాలు
కుద్దాలములుఁబోని కోఁఅవిూసముల
నులివెట్టుకొంచు నుమ్మలికతోఁ, రాము
నరనాథుగరువంపునడక రోఁయుచును (౫౧౫ పా.)

... ... ... ...

ఇందలిఛందస్సు ద్విపదకుఁ జాలసన్నిహిత మగు మంజరికిఁ జాలసన్నికృష్టముగ నుండును. అరయనరయ నిది మంజరి యన్నను ననవచ్చును.

ద్విపది యని కావ్యాలంకారచూడామణిలోఁ నున్నది. తక్కినగ్రంథములలోఁ నెల్ల ద్విపద యని ప్రయోగింపఁబడినది. సంస్కృతకోశములలోఁ ఋక్కున కర్థమగునపుడు 'ద్విపద' యనియు మాత్రాఛందోవిశేషమున కర్థమగునపుడు 'ద్విపది' యనియు వ్రాయఁబడెను.

"ద్విపదా-స్త్రీ. ద్వౌపాదావస్యాః, పాదస్యాన్త్యలోపఃటాపి భత్వాత్పదాదేశః-ఋగ్విశేషే-ఛందోభేదే జీప్-ద్విపదీ-" (శబ్దస్తోమమహానిధి).

"ద్విపదా-స్త్రీ-ఋగ్విశేషే-ద్వౌపాదావస్యాః, సంఖ్యాసుపూర్వస్యేతి పాదస్యాన్తలోపః-టాబృచీతి టాపి, పాదఃపత్"

"ద్విపదీ-స్త్రీ-మాత్రావృత్తాంతరే-ఆదౌషట్కలసంగతమేతత్తదనుపంచచతుష్కలమ్।గుర్వంతం, ద్విపదీ భవతీహావింశత్యష్టకలందలమ్........."

(శబ్దార్థచింతామణి)

పయిసందర్భమును బట్టి మాత్రావృత్త భేదమగునపుడు 'ద్విపది' యనియె చెప్పుట యుక్త మనితోఁచుచున్నది. కాని పై సంస్కృతకోశములలోఁ జెప్పఁబడినమాత్రలలక్షణము గల పద్యమును సంబంధించిన దీతెలుఁగుపద్యముకాదు. అట్లయినను ఋగ్భిన్న మగుపద్యమునకు వాచక మగునపుడు 'ద్విపది' యనుటయె వ్యాకరణసమ్మత మనవలసి యున్నది.

పరిశీలింపఁగా 'ద్విపద'అనునదియు సాధుశే యేమో యని తోఁచుచున్నది. రెండు పదములు గలది యను విగ్రహముచే 'ద్విపద'శబ్దము సాధు వనుటలో విప్రతిపత్తిలేదుగదా. పదశబ్దమునకు బద్యపాదమను నర్థమును గలదు గదా.

"పద-న. పద-అచ్-చిహ్నే, స్థానే, పాదే, ఉద్యమే త్రాణే, వస్తుని, శబ్దభేదే, (సుప్తిఙంతరూపే) ప్రదేశే, శ్లోకపాదేచ" (శబ్దస్తోమమహానిధి.)

"ద్విపద పుం, ద్వేపదేయస్య..." (శబ్దస్తోమమహానిధి).

పండితకవిపుంగవుం డగు పాల్కురికిసోమనారాధ్యుఁడు పైరీతి నరసియే కావలయు 'ద్విపద' శబ్దమును మార్పరానిరీతిగఁ దనపండితారాధ్యచరిత్రమునబద్ధముచేసియున్నాఁడు.

"...ఆదిప్రాసనియతి। తప్పకుండఁగ ద్విపదలు రచియింతు
నొప్పదు ద్విపదకావ్యోక్తి నా వలదు।......ద్విపదాంబురు
హాముల ధృతిబసవేశు।ద్విపదాంబురుహాము లతిప్రీతిఁబూన్తు"

ఇంక ద్విపదమంజరులలక్షణములు పరిశీలింప వలసి యున్నది.

"శక్రత్రయంబును సవిత్రుండుఁ బాగ
విక్రీడితులు మృదుద్విపదికి నెపుడు
వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని
వలయు బ్రాసంబంద్రదు వరుస మంజరికి"

(కావ్యాలం 8 ఉల్లా)

ప్రాచీనుఁడగువిన్నకోటపెద్దిరాజు చెప్పినయీలక్షణమును బట్టి ద్విపదకును మంజరికిని నెల్లవిషయములందును నొక్కటె లక్షణమనియు ద్విపదలోఁ బ్రాసనియమ ముండుటయుఁ మంజరిలోనది లేకుండుటయు మాత్రమె రెండిటికిని భేదమనియు విశదమగుచున్నది.

కవిజనాశ్రయమున ద్విపదలక్షణము మాత్రము చెప్పఁబడెను. ప్రాచీనకాలమున ద్విపదలుమాత్రమే ప్రబంధవాఙ్మయమున కెక్కి యుండుటచేఁ గానలయుఁ గావ్యాలంకారచూడామణికర్త చెప్పియున్నను ననావశ్యక మనితలంచి భీమకవి మంజరీలక్షణము నుపేక్షించియుండెను.

"ఇంద్రగణములు మూఁడినగణంబొకటి।
చంద్రాస్య ద్విపదకుఁ జనుఁ జెప్ప రేచ।

(కవిజనాశ్రియము).

పయినుదాహరించిన కావ్యాలంకారచూడామణి కవిజనాశ్రయాది లక్షణకర్తలు రంగనాథరామాయణాదిద్విపద

ప్రబంధములను బాగుగఁ బరిశీలించి సరియగు ద్విపదలక్షణమును వారికీతని చెప్పియుండిరని యాలోచింప వలసి యున్నది.

కవిజనాశ్రయమునకుఁ దర్వాతిదగు ననంతుని ఛందోదర్పణమునందు ద్విపదకును మంజరియుఁ జేర్పఁబడినవి. అందు ద్విపదలక్షణము ప్రాచీనపద్ధతినె చెప్పఁ బడెను. మంజరిలోఁ గొన్నినియమము లధికముగఁ జెప్పఁబడినవి. కాఁగా నప్పటికిఁ బ్రబంధముల కెక్కక చాట్వాదిరూపమున వెలయునట్టి మంజరులలోని నియమముల ననంతుఁ డట్లు వచించెనా యని యాలోచింప వలసి యున్నది.

"ఇంద్రులు మువ్వురు నినుఁడొక్కరుండు।
సాంద్రమై యొక్కొక్కచరణంబుఁ గొలువ।
నలరు పద్మోదరుఁ డంచు ధీరోత్త
ములు విస్తరింతురు ముదముతో ద్విపద."

(ఛందోదర్ప).

శ్రీమందిరాకారు జితదైత్యవీరుఁ।
గీర్తించుచోఁ బుణ్యసర్తనుండనుచు
యతివరాలు ప్రాసమిక్లెచోఁ బట నిడక
సరసిజనాభాయ సముదగ్రసాహ।
సాయ నమో యంచు శబ్ద మొక్కటియ
రెండుపాదముల నీక్రియఁ బంచి యిడక।
వెలయు ప్రాసము లేనిద్విపదయై పరఁగఁ
బూజింప నలయు వాక్పుష్పమంజరుల"

(ఛందోద)

ముందుదాహరింపఁ బోవురీతిని రంగనాథరామాయణాది ద్విపదకావ్యములలోఁ బయిమంజరీలక్షణములోఁ జెప్పఁబడిన నియమవిశేషములు లేమింజేసి ప్రాచీనలాక్షణికులు ద్విపదలక్షణములో నట్టినియమవిశేషముల నుపదేశింపరైరి. ఈక్రింది యర్వాచీనలాక్షణికులు రంగనాథరామాయణాదిద్విపదకావ్యములను సరిగఁ బరిశీలింపక స్థూలదృష్టిఁ బై మంజరీనియమవిశేషములు రంగనాథరామాయణాదిద్విపదకావ్యములందును గలవని తలంచియుఁ బ్రాచీనలాక్షణికులు ద్విపదమంజరులకుఁ బ్రాసతదభావములు మాత్రమె భేదకములని చెప్పియుండుట నరసియుఁ గావలయుఁ బయిమంజరీలక్షణములోని ప్రాసహైన్యమాత్రవిశేషము పోఁగాఁ దక్కినలక్షణము లెల్లద్విపదయందును నుండవలయునని నిశ్చయించికొని యీక్రిందిరీతిని ద్విపదలక్షణమును జెప్పియున్నారు. అప్పకవి యర్వాచీనుఁడై నను ననంతామాత్యుని వలెనె ద్విపదలక్షణములో నట్టినియమవిశేషములను జెప్పక మంజరిలో మాత్రమె వానిని చేర్చి యున్నాఁడు. అప్పకవికిఁ బూర్వుఁడును ననంతామాత్యునకుఁ దర్వాతివాఁడును నగు తాళ్ళపాకము చిన్నన్న యీక్రిందిరీతి ద్విపదలక్షణమును వచించియున్నాఁడు.

ద్విపద "వాసవుల్ ముగ్గురు వనజాప్తుఁ డొకఁడు
భాసిల్ల నదియొక్క పదము శ్రీకాంత
క్రమమున నవినాల్గుగణముల నడచుఁ
గ్రమదూరముగఁ బ్రయోగము సేయరాదు

ఆపాదమునకు మూఁడవగణంబాది
దీపించు యతి యంబుధిప్రియతనయ
యుపమింప నవి ప్రాసయుతములై రెండు
ద్విపదనా విలసిల్లె వికచాబ్జపాణి
ద్విపదకు ద్విపదకుఁ దెగఁ జెప్పవలయు
నెపుడు సంస్కృతమున నితరభాషలను
యతులలోపలఁ బ్రాసయతి దక్క సకల
యతులు చెల్లును బ్రయోగానుసారమున
ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద
మపుడు ప్రయోగింప నది యయుక్తంబు
మఱియు సంస్కృతపు సమాసరూపమున
నెఱయ నెన్నిటినైన నిర్మింపఁ దగును.''

(అష్టమహిషీకల్యాణము)

ద్విపదకవులలోఁ బ్రాచీనతముఁడగు పాల్కురికిసోమనారాధ్యుఁడు తనద్విపదప్రబంధములలోఁ బదమధ్యపాదావసాన ప్రయోగములను బదమధ్యపద్యావసానప్రయోగములను బ్రాసయతిప్రయోగములను ధారాళముగాఁ జేసి యున్నాఁడు. ప్రాచీనలక్షణగ్రంథము లగు కావ్యాలంకారచూడామణి కవిజనాశ్రయములలో నీవిషయమున నేమియుఁ జెప్పఁ బడి యుండలేదు. పదమధ్యపాదావసానము దోషమని చిన్నన్నగారును జెప్పియుండలేదు. మంజరులలోమాత్రమె పదమధ్యపాదావసానము దోషమని యనంతామాత్యాప్పకవులు చెప్పియున్నారు. ఇంకఁ బదమధ్యపద్యావసానమును బ్రాసయతిని పాల్కురికిసోమనారా

ధ్యుఁడు ధారాళముగాఁ బ్రయోగించుటయే గాక ప్రాసయతి ప్రయోగార్హమని చర్చించియు నున్నాఁడు.

"జాతులు మాత్రానుసంధానగుణవి
నీతులు గాన, యనియతగణ ...
నియును బ్రాసోవా యనియు యతిర్వా య।
నియుఁ జెప్పు ఛందోవినిహితోక్తి గాన
ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాదిప్రాసనియతి॥
తప్పకుండఁగ ద్విపదలు రచియింతు।..." (పండితారా)

పయిరీతిని బ్రాసయతి ద్విపదలలోఁ బ్రయోగింపనగునని సాధించుటయే గాక పయిపద్యములలోనె పదమధ్య పద్యావసాన ప్రయోగములను ధారాళముగఁ జేసి యున్నాఁడు. ఇంక సోమనారాధ్యుని ప్రాసయతి ప్రయోగములు దిఙ్మాత్రముగఁ జూపఁ బడుచున్నవి.

"ఉల్లమున మదీయవల్లభుఁ జెన్న।
మల్లికార్జునుఁ దేటతెల్లగా నిలిపి॥"
"వ్యక్తలింగముల సద్భక్తరసాభి।
షిక్తుల నూతనభక్తులఁ గొలిచి (బసవపురాణ. 1 ఆ).

చిన్నన్నగారి యష్టమహిషీకల్యాణములోని ద్విపదలక్షణమును విశ్వసించుచు నేఁటిలాక్షణికు లీక్రిందిరీతి నభిప్రాయ పడుచున్నారు.

"ద్విపదమున నితరకవులెవ్వరును బాటింపని ప్రాసయతి నీతఁడు చేర్చెను. రంగనాథరామాయణమునఁ గాని గౌరనహరి

శ్చంద్రచరిత్రమునఁగాని ప్రాసయతి యెక్కడను గానరాదు. ఈతఁడును నీతనికనుయాయు లగుశివకవులు మాటికొందఱును మాత్రమె యీద్విపదప్రాసయతిని జేర్చిరి..."

(బసవపురాణపీఠిక. 88 పుట).

సరిగాఁ బరిశీలింపకయె పీఠికాకర్తగా రిట్లువ్రాసిరి గాని రంగనాథరామాయణమునఁ బ్రాసయతిప్రయోగములును బద మధ్యపద్యావసానప్రయోగములును ననేకస్థలములం దగపడు చున్నవి.

—♦ ప్రా స య తి ♦—

"ఎనసి గోహత్యచేసిన వానిగతికి"

"శరణార్థిఁ బ్రోవనిదురితాత్మగతికి"

(రంగనాథరామాయణము. 131 పు.)

"రసరసాన్నములను మెసవెడువాఁడు"

(రంగనా. 137 పు).

"నిలువ గాకుండ నిచ్చలు నోసంగుదువె"

(రంగనా. 138 పుట)

"అని తనపెండ్లివార్తను నంతఁ దాను"

(రంగనా. 146 పుట).

—♦ పదమధ్యపద్యావసాన ప్రయోగములు ♦—

"తమతమయిండ్లకుఁ దార్థిసరుగ।
శమితాత్మ లగుమునిసంఘంబు లప్పు।
డంత నావృత్తాంత మాయోగదృష్టి"

(రంగనా. 37 పుట).

"విశ్వంబు కలగొని వెదకి నాయెదుట।
నశ్వంబు గొనక మీరరుదేర వలవ
దని పల్కె నొంగాక......" (రంగనా. 40 పుట).

"చిన్నారి నూంగారు సింగంపుంగౌను
పొన్నపూంబోకి ల్లి పొదలెడుపిఱుదు
లూరులతీరు......" (రంగనా. 60 పుట).

"కౌసల్యసతి వామకర మంటం బట్టి
కైసేత లుడివోయి గతపుష్పకర్ణి
కారశాఖయుం బోలి...... (రంగనా. 1—35 పుట.)

("కర్ణి కార-పు-కర్ణి కా మృచ్ఛతి..." శబ్దస్తోమమహానిధి)

"వసుధ రాలెడివిరుల్ వర్షోపలములు
ముసురు తేనియసోన ముంచినవాన
గా నొప్పుచువసంతకాలంబు......"

(రంగనా. 198 పుట).

పయిరీతిని రంగనాథరామాయణములో సైతము ప్రయోగములు వెలయుచుండుటచేతనె ప్రాచీనలాక్షణికు లెవ్వరును ద్విపదలో పదమధ్యపద్యావసానప్రయోగమును ప్రాసయతిప్రయోగమును ఘటింప రాదనుచుం జెప్పియుండలేదని తోంచుచున్నది. ఉపజాతులలో (సీసాదులు) మాత్రమె ప్రాసయతులు చెల్లుచుండుటయు జాతులలో (కందాదులు) నవి చెల్లకుండుటయు సంప్రదాయమై యుండుటంజేసి జాతు లనందగుద్విపదలలోం బ్రాసయతిప్రయోగము సంప్రదాయసిద్ధము కానేరదని తలంపరాదు. జాతులలో ద్విపదలకుం గొన్ని విలక్షణధర్మములు లేకపోలేదు.

సమాసమధ్యపద్యావసానమును బదమధ్యపద్యావసానమును నితరపద్యములందు లేవుగదా. అట్టివింతప్రయోగము సైతము ద్విపదలవిషయమున నంగీకరింపఁబడలేదా?

జాతు లగుద్విపదలయందే ప్రాసయతి సమ్మతమగు నపుడింక మంజరిలో నద్దానిసమ్మతి కైముత్యన్యాయసిద్ధము గదా. ప్రాసనియమము లేమింజేసి మంజరి యుపజాతి యనఁదగునన్నను ననవచ్చును గదా. ప్రాసనియమము లేమింజేసి మంజరిలోనిప్రతిపాదమును బద్యమువంటిదే యని యంగీకరించినప్పుడును ద్విపదలలోఁ గలపదమధ్యపద్యావసానప్రయోగములను బట్టి మంజరులలో నుండరాదని యనంతుఁడు చెప్పిన "సముద గ్రసాహ సాయనమోయంచు శబ్దమొక్కటియు, రెండుపాదముల నీక్రియఁ బంచి యిడక" అనునియమము సైతము పాటింపఁదగినది కాదని గ్రహింప నగును.

పయిసందర్భములను బట్టి యీప్రబంధము నందలిఛందస్సు మంజరియన్నను ననవచ్చుననుట యుక్తమె యనిగ్రహింపవలెను.

ఈగ్రంథములోని యితరవిశేషప్రయోగము లాయాస్థలములలోనె లఘుటీకలో సమర్థింపఁ బడును. కాన నిటవిస్తరింపలేదు.

కొన్నిసంవత్సరములక్రిందటనె రచింపఁబడినదయ్యు నియ్యది కొన్నికారణములచే నేఁటిదనుక ముద్రాపితము కాఁజాల దయ్యె. నేఁటికైన ముద్రితమై విమర్శకరసికశిఖామణుల మానసవీథిని విహరించుభాగ్య మందినందుల కెంతయు సంతోషించుచున్నాను.

ఇట్లు విన్నవించుసుజనవిధేయుఁడు,

విశాఖపట్టణము,
12-11-1934.

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి,
గ్రంథకర్త.

## —:గురుదేవతాస్తుతి:—



శ్లో॥ సుధియా పరిపూతమానసౌ।
కలయేఽహం జగతః ప్రియంకరౌ।
పితరౌ మమ వేంకటాంబికా।
ముఖలింగేశ్వరజంపతీ హృది॥ ౧॥

శ్లో॥ పితామహభ్రాతృసుతం స్వవిద్యా।
గురుంచ చింతామణి సత్సమాఖ్యమ్।
శ్రీవత్సగోత్రోద్ధరణప్రశస్తిం।
నమామి నారాయణ సత్కవీంద్రమ్॥

(మొదటిశ్లోకమున మాతాపితృపరముగాను పార్వతీపరమేశ్వర పరముగాను నర్థద్వయము నెన్నునది. రెండవశ్లోకమున గురువులగు నారాయణపండితుల పక్షముగాను విష్ణుపక్షముగాను నర్థద్వయము నెన్నునది. భ్రాతృజాయామ్మను కాళిదాస ప్రయోగమునుబట్టి భ్రాతృసుతశబ్ద సమాసము గురుపరార్థమున సప్రమాణమగుచున్నది.)



రాజమండ్రి రామాప్రెస్ నందు పీఠిక 22వ పేజీవరకు ముద్రితము.

# వీరసింహుఁడు



## ప్రథమగుచ్ఛము—ప్రథమపుష్పము.



శ్రీ మన్మహారాజ, భూమీవరాహా,
రాజాధి రాజ, వీరప్రతాపా, ష్ట
దిగ్గజ భయద, రాడ్దేవేంద్ర, రాజ
పరమేశ, మూరురాయరగండ, బిరుద
ధరణీతలేంద్రదోస్స్తంభసౌధంబు,
నభ్రంకష మహీధరాటవ్యకృత్రక
సాలపరంపరాక్రాంతగుప్తంబుఁ,
దుంగభద్రాపగాభంగాశుగౌఘ
సంరక్షితోత్తరాశావకాశంబు,
దక్షిణాధీశ్వర స్థాయిసామ్రాజ్య
వనజాలయాచ్యుత వక్షఃస్థలంబు
కర్ణాటమండల కాంచన స్యూత
మణిహార హీరకాత్మకనాయకంబు,

---

టి—౧—౮ ఇవెల్ల విజయనగర రాజులకుఁ బారంపర్యముగఁ జెల్లుచున్న బిరుదములు. (చూ-నారచించినవ సుచరిత్ర విమర్శనము ౧౫౩ పుట) శ్రీమదిత్యాదిచేగ్రంథాది మంగళమాచరింపఁబడెను.

౬ అకృతక=సహజ

౭ ఆశుగౌఘ=వేగముగాఁ బాఱుప్రవా...

౯ ఉపసర్గసంధియతి. అప్పకవీ. ౩ ఆ ౧౭౩

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం

శ్రీరంగరాట్ సదా శివ దేవరాయ
రాజ్యసంస్థాపక రామరాజేంద్ర
రాజనీతివిలాస రక్ష్యమాణంబు,
శాంతపరస్పర సహజవిరోధ
విద్యేందిరోల్లాసి విద్యాపురంబు,
విభువిజాపురపరివృఢునిరోధంబుఁ
బొలఁగించుకొని నేర్పుబలిమి నుద్వృత్తిఁ
జేసె నొక్కఁడు వీరసింహుఁడ న్వాఁడు,
సాహసగాంభీర్యశౌర్యధైర్యంబు
లొలికెడు చుఱుకుఁజూపుల తీరువాఁడు,
శృంగారవీరముల్ సంగాతమంది

---

౧౪ ఉ॥ ఆపటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయ ధా
త్రీపతి సార్వభౌమ మహితప్రియుఁడై వితతప్రతాప సం
తాపితశత్రుఁడై యలసదాశివరాయ నిరంతరాయ వి
ద్యాపుర రాజ్యలక్ష్మికి నిదానము తానయి మించెనెంతయున్.
(రామాభ్యుదయము).

౨౪ ‚రసస్యోక్తిః స్వశబ్దేన' అను చెప్పునఁ గల్గు రసదోషమున కిది లక్ష్యముకాదు. విభావాది వర్ణనరూపమున నాయా రసములను వ్యక్తపఱుపవలసినపు డయ్యైరసములను స్వనామవాచ్యములుగఁ జెప్పుట యద్దానికి లక్ష్యము కానోపును. ,,వీరోరసః కిమయమేత్యుతదర్పఏషః'' (భవభూతి యుత్తరరామచరితము) ఇట్టికవిప్రయోగములుపెక్కుగలవు.‘ఇంద్రుఁడు రంభతో శృంగారరసము వెలయునట్లు క్రీడించెను' 'ఇట్టివి దోషావహములు.

యాకారమందిన యాస్యంబువాఁడు.
సింగారములకెల్ల, సిరి పుట్టినిల్లు,
విజయలక్ష్మికిఁ దావు, వీరుల ప్రోవు,
భూతలస్వర్గమప్పురి సేరి యతఁడు
సురమార్గమును దాఁకు వరణాగ్రములును,
దుష్ప్రాపదదుర్ధర్ష దుర్గనిర్మితులుఁ
గుడిమెడమలయందు నెడయింతలేక
పుడమియీనినయట్టి వడువునందోఁచి
యౌన్నత్యమునయందు నందంబునందు
నొండొంటి వెనుదీయకుండు సౌధములు,
రత్నగర్భాదేవ్యురస్థ్సలన్యస్త
రత్నభూషాసహస్రంబులుంబోని
నవరత్నకోటులన్ భరితంబులైన
రత్నాకరోపమ రత్నాపణములుఁ,
గనులకామెతలిచ్చి తనియించుచుండ,
నిరుగెలంకుల సౌరులిరుగన్నుతిగువ,
నింద్రజాలములందు నెదస్పృష్టులందుఁ
గలలందు నగుధాతృకౌశలాగోచ
రములైన తద్వైభవముల నీక్షించు
చొడలెఱుంగక పోవుచుండి యొక్కెడను
మాతంగవేలాద్రి మాలావృతంబు

౪౧ ఎదస్పృష్టులు=మానసికసృష్టులు=భావనాశక్తికల్పితరూపములు.

ధావద్రథోచ్చలన్నాకాచితంబు
యోధాళియాదస్సమూహావృతంబు
ధన్వివ్రజాభంగదంతురవీచి
కావారమునగు స్కంధావారజలధి
వీక్షించెః వీక్షించి వెఱఁగంది యతఁడు
తలయెత్తి పంకించి తలపోసెనిట్లు:—
"ఔర! యిల్లాటఁగా యలి యదిల్‌సాహి
సులతాను లోలోన స్రుక్కుచునుండు;
ఇభరామకుతుబుసా యెదతల్లడిల్లఁ
దెవ్వులుదౌలనిపీడఁ దెరలుచునుండు;

---

౪౮ వికల్పయతి.

౪౯ వరుసగా నిల్చిన ధనుర్ధరులవరుసలు విఱుగని తరంగములవలె నుండెను.

౫౨-౬౦:—"భవేద్విరుదశబ్దేషు। యథేష్టం వర్ణకల్పనా। గ్రామమానుష్య బిరుద। శబ్దానామపిసో (సమాసో) మతః।......। స్వరూపతస్సమాసః స్యా। ద్వికారస్య కృతావపి॥" (వికృతి వివేకము ౧౩౪-౩౩౫పుట).

౫౨ షాహి=సాహి=రాజ్యము; షా=సా=రాజు; అన్యదేశ్యమచ్చతెనుఁగులోనిది గాన నందు సంస్కృతభవమునందువలెనె యనాంధ్రవర్ణము లుండరాదనిలాక్షణికాశయము.

౫౫ 'తౌలు' అనునది యపశబ్దమనియు 'తవులు' అనియె యుండవలెననియు వసుచరిత్ర టీకాకర్త వ్రాయుట పొరపాటు. (చూ. ౭౧౧ పాదము లఘుటీక).

‘ఆముదానగరనిజాము హుస్సేను’
నిస్సీమచింతాబ్ధి నిర్మగ్నుఁడగును.
కృష్ణరాయాత్మజాధీశుఁడార్వీటి
బుక్కరాయకులాబ్ధి పూర్ణచంద్రుండు,
రాజదేవేంద్రుండు, రాజరాణ్మూర్ధ
తటకిరీటావళీఘటితమాణిక్య
నీరాజితపదాబ్జుఁడో రామరాజ
నరపతీంద్రుఁడుదక్క ధరణీశు లెవరు
నీరీతిగ నిరీతి నేలంగనైరె?
మలకలమెలికలన్ మలఁగింపనైరె?
క్షత్త్రియాధములింకఁ గాణాచియంచు
స్వమతాభిమానంబు చాలించికొంచుఁ
దురకరాజ్యమునందె తిరమాదు రకట!
ఆగర్భశత్రువై యలియదిల్‌సాహి
యస్మృతరాజద్రోహ మదిమి మాపైని
దిమ్మరాజాఖ్యబందీనాథుకఱకు
ఖాయిదాలోనుంచి కారించుకతన

---

౫౮ ఉ॥ ఆపటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయ ధా। త్రీపతి సార్వభౌమ దుహితృప్రియుఁడై.....(రామాభ్యుదయము).

౬౩ ‘అశ్వపతులు, గజపతులు, నరపతులు,’ నని యాకాలపు దక్షిణ దేశమునందలి రాజులు మూఁడు తెగలుగ నుండెడివారు.

౬౮ నిరీతి=ఈతిబాధలు లేకుండునట్లు.

కలియుగన్నై కుంతకర్ణాటరాజ్య
లక్ష్మి సేవింపఁజాలక యింతదనుక
వ్యర్థమయ్యెనుగాదె యకట జన్మంబు!”
అంచులోఁగుందుచు నంతంత నదరి
“అన్న! కూలితె తృణచ్ఛన్నకూపములె
యగు తురుష్కులబారిక గ్గంబ యగుచు.
తల్లిదండ్రులు చన్నతమ్ముని చన్నన్నుఁ
బసివాని విడనాడవలసెఁగా నీకు.
అట్టినీయపమృత్యు వాలింపఁజేసి
యసువులఁ జవిఁజూపి కసుగందనీక
మఱపించి కాలంబు మనిచెఁగా నన్ను!”
అని యాతఁడాత్మ పూర్వావస్థఁదలఁచి
కన్నుఁదామర లశ్రుకలుషముల్గాఁగ
నుండె నిశ్చేష్టుఁడై యొక్కింతతడవు.



ఎట్టి యిక్కట్టులు నెదద్రీల్పకుండ
మఱపించి మెలమెల్ల మనిచి యూరార్చు
మేలైనబందువు కాలంబటంచుఁ
బలుకుదు రార్యులు భావింపలేక.

౪౭-౫౪ చంపకుండనుంచి పీడించుటయె చంపుటకంటెఁ గఠినశిక్ష గదా. విషాదపర్యవసాయి కావ్యముగాన నిందు బీజసంధిలో శోకమును సైతము వర్ణించుటయావశ్యకమె.

మఱపించి బ్రదికించి మదినుబ్బఁజేసి
యెడనెడఁ దాస్మరియింపఁగాఁజేసి
ప్రేవులు పెకలించి ప్రీల్చిగుండియల
జీర్ణింపఁగాఁజేయుఁ జెనటికాలంబు.
గాఢాంధకారంబు కవియుకాలమున
నొంటిమైనిశ్చింత నుండు వేళలను
నుద్బోధసామగ్రి యొక్కింతలేక
తనుదాన మానసంబున గోచరించి
హృదయపంజర మాధి ప్రిదిలించుఁగాదె!

♦ ♦ ♦ ♦

౧౦౦ నీరపూరంబగు నీలమేఘంబు
నంతరంబుననుండి యడరుక్రొమ్మెఱుఁగు
కరణిని శోకాబ్ధితరఁగలందెరలి
క్రోధముద్రేకింప రుద్రుచందమున
నుగ్రుఁడై యాలోహితోత్ఫుల్లలోల
నయనుండుఁ గంపితావయవుండు నాచు,
"వెతలొందఁగానాన వీరసింహుండ
యంతరాంతరములఁ జింతలఁజివికి
కరవాలసాక్షిగాఁ గైకొన్నయట్టి

---

*౨ పూర్వానుభూతమగుదానిని జ్ఞప్తికిఁ దెచ్చు సదృశానుభవాది సామగ్రి కుద్బోధమని పేరు.

పరవీరమారణవ్రతదీక్ష చెలుతె.
శ్రీరామరాయల గారామువడసి,
యలఁతికాలములోన నడర నున్నట్టి
హైందవమహామదీయాయోధనమునఁ
గాలదండాంచితకరతలాత్యుగ్ర
కల్పితయకృతాంతకార్కశ్యమూని,
పశుల సపాదుల న్విశసించి నీదు
క్రతుదీక్షఁబూరించి కసిదీఱనంత
స్వాయత్తచిత్తుఁడై స్వయముగాఁదిమ్మ
రాజు కానుకపట్టు నా జగజ్జ్యోతి
నావిలాసవతి మాల్యవతిఁ జేపట్టి
జన్మసాఫల్యంబు సాధించుకొనెదు
కర్తవ్యమకట! విస్మర్తవ్యమొక్కొ!"
అని యిట్టులనుకొంచు నాత్మనిశ్చయము
తలఁపున కెక్కంగఁ దరలెనచ్చోటి.

---

౧౦౯ దీక్షితులు, దుఃఖించినచో, దీక్షాభంగమగుననిభావము.

౧౧౫ వీరసింహుఁడు సపాదవిశసనయజ్ఞ దీక్షితుఁడనిభావము. సపాదులనఁగా బీజాపురపుఁగురకలు.

# వీరసింహుఁడు.



## ప్రథమగుచ్ఛము—ద్వితీయపుష్పము.



రాజాధిరాజ వీరప్రతాపాంక
రాజ దేవేంద్రుఁడౌ రామరాణ్మౌళి
తేజోయశశ్శ్రీలు దిశలెల్ల నిండ
బీరెండ రేయెండ పెనఁగునట్లుండ,
స్వర్ణస్థగితరత్న సౌధాదిరుచులు
దీప్రంబులై భువిం దివిని వెల్గింపఁ,
కనకమయంపుఁగీన్కాపు గద్దియలు
మొహాములు ఫరుషులు మురువుఁజూపంగఁ,
కస్తురి చందనాగరులు జవ్వాజి
పునుఁగు నత్తరు వల్వలను బుక్కిలింప,
నన్యోన్య మెరవిచ్చి యంశుమాలికల
రతనంపు గుచ్ఛముల్ రాణ గొల్పంగఁ,
గెంపులదీపాల కిరణముల్ కాఁడి

---

౧౩౪ వ్రేలఁగట్టిన రత్నగుచ్ఛములం దొండొంటె కాంతులు ప్రసరించుట సహజము.

౧౩౬ ప్రక్కలనున్న దీపకిరణములు నీటిలోఁతుకొలఁదిని జొచ్చి ప్రసరించుట సహజము.

పాఱుచుఁగుట్టిమస్ఫటికలావణ్య
వారిపూరంపుగంభీరిమంబెల్లఁ
గనుచూపుమేరను గానిపింపంగ,
నలుగెలంకుల దర్పణంబులన్నిఱు
నిద్దంపుఁబటికంపు నిడుదకుడ్యంబుల
యంతరంబుననుంట నారచ్చసొంపు
ప్రతిబింబ విశ్వరూపము చూపుచుండ,
విధిసృష్టి కొకవింతవిన్నాణ మిచ్చు
కవిమానసికసృష్టిఁ గనరానియట్టి
సౌధంబునం దెల్ల చంద్రార్కవంశ్య
లోకాధిపతులు కేల్మోగిచి కొల్వంగఁ,
గౌటిల్యచాణక్య కవిదేవమంత్రి
తులితులౌ హితమంత్రు లోలసి సేవింప,
సంగీత సాహిత్య శారదామూర్తి
ధీరకవీంద్రులు దేశి, మార్గమునఁ

---

౧౪౦ అన్యోన్యాభిముఖముగ నద్దములున్నపుడు వాని నడుమనుండు వస్తువులు పరంపరగా రెంటిలోను బ్రతిబింబించుట సహజము.

౧౪౪ విధిసృష్టికి మెఱుఁగుపెట్టు కవిభావనారూపసృష్టిని సయితమద్దాని సొబగుమీఱుచున్నదని భావము.

౧౫౦ శారదామూర్తి=సరస్వత్యాకారములగు; లేదా మూర్తి కవియనురామరాజభూషణుఁడు మున్నగు.

౧౫౧ దేశి=ఆంధ్రకర్ణాటాదికవిత-మార్గ=సంస్కృతకవిత.

గృతుల దిగ్విజయముల్ గీర్తించుచుండ,
ధీరాప్రధృష్యగంభీరాప్రమత్త
తలు వీక్షణములందుఁ దాండవంబాడఁ,
బ్రాభవోత్సాహ నిరంకుశత్వములు
ముదిడాఁగురించుచు మోమునందోలుక,
వైరిరాట్ప్రాభృతతారహారములు
తనకీర్తి వైభవంబును జూపుచుండ,
రతసంపుఁబనులతో రాణించుచున్న
వలిపంపుహొంబట్టువలె వాటురస్థ
లాశ్లిష్టజయలక్ష్మి యందంబుఁజూప,
నారామదేవునియపరావతార
మా రామరాజక్షమామరేశ్వరుఁడు
పేరోలగంబుండఁ, బృథ్వీశుఁడొకఁడు
ఫాలపట్టిక మోడ్పుఁ గేలుకీలించి
వీరసింహుని పూర్వవృత్తాంతమంత
నవతారికంజేసి యనియె నీరీతి:
"రాజలోకాధీశ, రామభూమీశ,
విద్యాపురమహోచ్ఛవిభవంబయనున
యస్యాంతమణిచేత నాకృష్టుఁడగుచు

౧౫౪ ప్రాభృత=ఉపాయన.

౧౬౫ శబ్దస్తోమమహానిధిప్రభృతి ప్రామాణికకోశములలో నీయర్థమున 'ఫాల' శబ్దము కానరాదు. ఫాలమనియె యగపడుచున్నది.

జగదేకమాత విజయనగరంపు
సామ్రాజ్యలక్ష్మికిఁ జరణసేవలను
బచరించి కృతకృత్యభావంబునందఁ
గోరి మోసలనుండు వీరసింహుండు;
స్వామికార్యమునందుఁ బ్రాణంబునేనిఁ
దృణముగాఁ జూచెడు తెంపరి; రాజ
కార్యరహస్యముల్ గనుమదినైన,
విశ్వసింపనియట్టి విశ్వాసపాత్రుఁ;
డేకీభవించుచు నాకారమందు
శౌర్యవిక్రమసాహసముల వైభవము.”
అనెడి యారంగరాయని విన్నపంబు
మన్నించు విభుచేయు సన్నలతోన
తేని మానసమూర్తి నానొక్కభటుఁడు
పరుగున మోసలకరిగి, యచ్చోట
శ్రీరామ రాణ్మౌళి సేవాపదంపు
మిన్నందు సౌధాన మెలఁగంగఁగోరి
సంకల్పసోపాన సాహస్రములను
రచియించుచందందు భ్రమియించువాని
జనకునిబాల్యంపు సఖుఁడైన రంగ
రాయండు తనుఁగూర్చి చేయు విన్నపము

---

౧౮౫ ఏతాదృశసౌధవిహారము సైతము మాల్యవతీప్రాప్తి నిదానసామగ్రిలోనిదే యని యెన్ననగును.

రారాజు మన్నించి రావించునంచున్,
నాజగజ్జేతకు నాలోకపతికి
నీయొక్క మానిసి చేయునదేమి ?
యని నిరాశుండౌచు, నాశ్రితావనుఁడు
ననునేల దిగనాఁడు ననియూసగొంచు,
నంతంత నాందోళితాంతరంగమునఁ
గూరుచుండుచు, లేచు, చూరకదెసలఁ
గనుఁగొంచు, నేశబ్దమును విన్నఁదన్నుఁ
బిలిచిన పిలుపుగాఁ దలఁచుచు, నంత
నాకారగుప్తుల నడరించువాని,
వీరసింహునిగాంచి రా రమ్మనంగ,
నదరుపాటునలేచి యటునిటుం గాంచి
కండువా మొలఁజుట్టి కాన్కచేపట్టి
వినతుఁడై యాతండు వెడలుచున్నంత,
మిన్నందుమోదంబు మేరమీఱంగ,
నచ్చెరువందంద ఱిచ్చపాటొసఁగఁ,
జేయంగఁదగునట్టి చేఁతఁ జింతించు
తలఁ పంకురింప, నుత్తలము రెట్టింప,
వీనుల నమృతంపు సోనలన్నించు
వివిధగానంబుల చవులను గొనక,

---

౨౦౩ విద్యాపుర సార్వభౌము దర్శనమున కేగు సామంతులు సైతము నడుమున కుత్తరీయమును జుట్టుకొని వెళ్లుట సంప్రదాయము.

పన్నీటి జలకేళి వాపీచయంబు
పలుగెలంకుల నించువలపు మూర్కొనక,
మిన్కులఁ గన్నుల నిఱుమిట్లుగొలుపు
కుందనాల పనుల తోరణాలఁ గన్గొనక,
కడచునాతని కట్టియెడ నొక్కపెట్ట
నిలుకడఁ గన్నమించుల వేనవేల
వలె వెలుంగులబారు, వన్నెలనీఱు
రారాజుమహలు, దర్బారుకన్ బ్రామె.
అంతనచ్చోటి యవ్యాజవిధేయ
తా లక్ష్మీదేవిపాదముల మ్రొక్కించె.
మ్రొక్కి కానుకరత్నమును రాజపాద
పీఠంబున నమర్చి వినిచె విన్నపము.
“ధన్యుండనైతిని ధరణీతలేంద్ర;
సఫలమయ్యెను నాదు జన్మంబు నేఁడు;
విద్యాపురాధీశ వీరావతార
దర్శనలాభమందఁగఁగల్గె నాకు.
అలవిజాపురి తురుష్కులవాటిఁ గాఁపు
రంబుండు వీఁడేడ! ప్రాజ్యపవిత్ర
మగునిట్టి భాగధేయంబేడ! నౌర!
పంకజాతంబేడ! భాస్కరుండేడ!
విధివిధానములకు వెరవెంచనౌనె!”
అని తన పుణ్యరాశిని నెన్నుకొంచుఁ

గృతకృత్యతంజూపు నతనితో నొక్క-
హితమంత్రి తేని సమ్మతి నిట్టులనియె:—
వీరసింహకుమార శ్రీరంగరాయ
విభుఁడు మీయెడఁ జేయువిన్నపం బరసి
శ్రీవారు తమదుపరివారవీరుఁ
గా మిమ్ముమనుపంగఁ గరుణించి” రనఁగ,
భాగ్యంబహో మహాభాగ్యంబటంచు
౨౮౦ శిరసావహించెఁ దద్వరము నాతండు.

♦ ♦ ♦ ♦

మంత్రులు హితులు సామంతులాప్తులును
దమతమచేయంగఁదగు విన్నపముల
విజ్ఞాపనముచేసి విరమించునంత
రాజనీతిజ్ఞుండు రామభూవిభుఁడు
ప్రాసంగికంబుగా వచియించు చిట్లు
తనగభీరాశయంబును వెల్వరించె!
“చంచలలక్ష్మికిఁ జాంచల్యముడిపి
విద్యాపురంబందు విడియంగఁజేయు

౨౮౦ సీ॥ ,,చేరి పాదముబలి శిరసావహించినఁ బాఖోధితానెంత భంగ పడిన” (నరసభూపాలీయము ౧౮ ౧౧౯ప).
,,శిరసావహించు సం-స-క్రి-తలయందు ధరించు చ॥....హార మెు। య్యనఁదననాథుఁడియ్యఁగఁ గృతాంజలియై జలజాక్షి వేగ గై। కొని శిరసావహించి......చంద్రా ౧ ౮” (శబ్దరత్నాకరము).

వీరాగ్రసరులార, విజయాంకులార,
వింటిరిగా! మీరు బీజాపురంపు
రాచూరు ముదిగండ్లరాయబారంబు;
కదనంబునం బాటి కార్యజ్ఞులగుచు
సహజవిరోధముల్ చాలించి విమతు
లిచ్చలో మెలఁగరే! యంగితం బెఱిఁగి;
బీజాపురీశుండు బీరంబు వీడి
యాత్మజవాత్సల్య మర్థింపలేదె?
ఆత్మరక్షార్థియై యగ్రజు బారి
కెడపడి యిప్పురి నిబ్రహీమర్థి
మిత్రభావంబునన్ మెలఁగంగలేదె?
కల్యాణమును వీడి కడుదైన్యమంది
శరణంచు హుస్సేను చరియింపలేదె?
శరణుసొచ్చి రటంచుఁ గరుణించి విడిచి
నిలుపుటంగాదె! యీబలువింత లొదవె;
ప్రాకృతాన్యోన్యవైరము లుజ్జగించి
కృత్రిమమైత్రులం గీలించికొనిరి;

---

౨౫౫ వసుచరిత్ర విమర్శనము. ౧౪౩పుట చూ.

౨౫౭ వసు-విమ ౧౪౧పుట చూ.

౨౬౦ వసు-విమ ౧౪౩ చూ.

౨౬౪-౨౬౫ ఇరుగుపొరుగుల దేశముల రాజులు పరస్పరము ప్రాకృత వైరులు. కార్యార్థముగఁ జేసికొన్న మైత్రి కృత్రిమ మైత్రి. "సఖా గరీయాన్ శత్రుశ్చ। కృత్రిమస్తౌహికార్యతః। స్యాతామమిత్రే మిత్రేచ। సహజప్రాకృతావపి" (మాఘకావ్య ౨ సర్గ౩౬ శ్లో).

కొననిండు వారేమి క్రొత్తయే మనకు;
మనల నెన్నండైన మఱతురే వారు;
మనలోనివారలై మసలుచు నుంద్రు;
వారికై మెలఁకువల్ వచియింపనేల!"



"అవ్యాజమధురమౌ నాకారమునకు
వినయగాంభీర్యముల్ విభవంబొసంగ
బ్రమయించి నిండోలగము వారి తేని
తోఁగూడ నావర్జితులఁ జేసెఁగాదె!
ఉచితమౌ వర్తన ముక్తినైపుణము
నొండొంటి నలరించుచుండు నీవీర
సింహునిదౌ మొగసిరి యేమిచెప్ప!
ఆ రామనరపాలు నంతటివాఁడు
నించుకేనియు వికల్పించకుండంగఁ,
గొమరుఁ బ్రాయపువానిఁ గ్రొవ్వాఁడివానిఁ
బరదేశముననుండి పఱతెంచువానిఁ
జేరఁదీయునె! యిట్లుచేసెనే యెపుడు!"
అనువార; "లిపుడేమియయ్యె భూవిభుని

---

౨౬౬-౨౬౯ ఇందు రామరాయలు శత్రులను సరకుసేయనిరీతిఁగ బాహ్యార్థమును, నమాత్యాములకు జాగ్రత్త చెప్పినట్లుగ నాంతరార్థమును నెన్నునది.

౨౭౫ ముత్పరకపత్యము పాక్షికము. (ప్రౌఢవ్యా. క్రియా ౧౬ సూ).

తూఁ వెరవరిమాట లరసి చూడంగ
సమ్మియు సమ్మని నయముఁ దోఁపించు,
బీజాపురీశుని వింత చెయ్వులను
వివరించి జాగ్రత్త నవరింపలేదె"
అనువారు; "అతిచిత్ర మవనీశుజాడ;
'అలియదిల్‌సా' యేమి! యతనితలేమి!
రాయబారం బేమి! రామరాయుండు
జాగ్రత్తపడు టేమి! చాలు" నన్వారు;
"జానాను జేని వాక్యముల నూహింప
వీరసింహుని గూర్చి వెడలినట్లుండు"
అనువారు నౌచు నాయా మహాజనులు
పరిపరివిధముల భావించికొంచుఁ
దమతమ యిండ్లకుఁ దరలి రెల్లరును.

♦ ♦ ♦ ♦

అన్యోన్యముఖదరహాస చంద్రికలఁ
గందావల్ వికసించి కాంతు లీనంగ,
స్వరలర్థసిద్ధికి విరిసోనగురియు
కరణి నిర్వ్యర విలోకనము లొండొరులఁ
దెలిచూపుఁ దమ్మిదండలను భూషింప,
వీరసింహుండు రంగారాయవిభుఁడు
నన్యోన్య మభివాదనాలింగనములఁ
దనిసిరి భక్తివాత్సల్యంబు లెసఁగ.
"భావిభవ్య పరంపరావేదకముగ

నసుకూల పరిణామి యయ్యెఁ గార్యంబు;
నీవంక జేఁడూను నిక్కమౌప్రీతి
శీలించువారు విస్మితులైరిగాదె;
నేరాస యనఁబోకు పృథ్వీశు లిచ్చు
గారామ కార్యంపు భారముం దెలుపు.
నీ చెప్పినదియెల్ల నిక్కంబ యయ్యె;
చారచక్షుండౌట నా రామరాయ
'లలియదిల్ సా'ది మహమ్మదీయేశు
లైకమత్యముఁగొన్న యోజాడఁగనియె
నమ్మికే నమ్మిన నయముఁ జూపించు
ప్రకృతిగంభీరుండు రామరా; జతని
యవ్యాజ విశ్వాస మది దురాసదము;
ఎవ్విధి మెప్పించి యెదఁజూఱఁగొందొ.
యుద్ధమాసన్నమైయుంట నిశ్చయము;
అలసపాదులజాడ లరసి కన్గొనుము."
అను రంగరాయల యనురాగకలిత
హితసూక్తి శిరసావహించె నాతండు.

---

౩౦౯ "ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం ప్రాయశ్చలం గౌరవ మాశ్రితేషు" (కాళిదాసు కుమారసంభవము) రామరాయలు చూపిన గారవ మేదోయొక గొప్పకార్యము నపేక్షించియే యుండునని భావము. అదియె సూచింపఁబడుచున్నది.

౩౧౨ వసు. విమ. ౧౪౬ పుట.

౩౨౧ శిరసావహించు-చూ ౨౪౦ పా.

# వీరసింహుఁడు.



## ద్వితీయగుచ్ఛము—ప్రథమపుష్పము.



ఉదయాద్రిశిఖ కానఁ బొదలందుఁ బొంచి,
పొడకట్టి తమముల పొడ వడంగించి,
తొగ కన్నెవలపు సోయగము మన్నించి,
మిన్నంది, జగముల మిసిమి నలంది,
కనుల కాసేచనకం బయ్యె రాజు.
వనదేవతలు ప్రీతి వాసంతికోత్స
వమునందుఁ గపురంపు దుము సల్లినట్లు,
కలశాబ్ధిజలయంత్రతులి తేందుబింబ
మమృతంపుఁ దుంపురు లుమియుచున్నట్లు
నిండారు పండువెన్నెల కాయసాగె.
ఆ యోషధీశామృతాసారవృష్టి

---

౩౨౧-౩౨౫ వీరసింహుఁడు వనిలోఁ బొంచి తురకల పొడవడంచి మాల్యవతి సోయగము మన్నించుట మున్నగు భావికథా వస్తు వింద సూచితమగుచున్నది.

౩౨౫ ఆసేచనకము=ఎంతచూచినను దనివితీఱనిది.

౩౩౦ నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది। గౌణవృత్తి వ్యపాశ్రయమ్। అతిసుందర మన్యత్ర। గ్రామ్యకక్ష్యాం విగాహతే॥

నవనవోన్మేషంబున న్వనుల్ గ్రాల,
రోదోంతరమున నాహ్లాదంపుటలల
రేఁచుచు సాంద్రచంద్రిక పొర్లి పాఱఁ,
గొండపంక్తులతోడఁ గోరాడుతుంగ
భద్రలో జలకేళి పచరించిలేచి
విరిసి పూఁదేనెల వెల్లువల్ నెఱపి
వలపు లీనెడు కైరవముల డిగ్గియలఁ
గెరలించి మధువాని కేళీవనముల
విహరింప నెలగంధవహము లెల్లెడలఁ,
గదలు చల్లలనాడు పొదల భూజముల
యాకుసందులనుండి యరుదెంచురవము
తరఁగలు శిలఁదాఁకి పొరలిపాఱంగ
జనియించు నదిలోని సాజంపురవముఁ
దక్కంగ రవమొండు చిక్కనీకుండఁ
జీమచిట్కనసీని సామంతమూని
శాంతనిశ్శబ్దతా సామ్రాజ్యపదవి
వనవాటికాలక్ష్మి పాలించుచుండ,
"ఎన్నండు నేనధికౌన్నత్యమునకు
భాజనంబౌచు సపాదచారులను

---

౩౩౬–౩౪౧ ఒకానొక విలాసివిహారము ధ్వనితమగునట్లు శైత్యసౌరభ్య మాంద్య సంపత్తిగల వాయువర్ణనము నిందుఁ బరిశీలింపనగును.

బట్టి భూకాంతుని పాదంబులందుఁ
బడవైచి జన్మసాఫల్యంబుఁ గాంతు?
ఇన్నాళ్ళవలెఁగాక యీదినంబైన
సన్మనోరథసిద్ధి సన్మానితునిఁగ
విట్ఠలేశ్వరుఁడు గావించునో? లేదో!"
అనుచు నుయ్యాల లూఁగు మనసుతో వీర
సింహుండు సభటుఁడాసీమ కేతెంచి
వనలక్ష్మి శాసనంబును మీఱలేని

---

3౫౪ ఇన్నాళ్ళు=ఇన్ని + నాళ్ళు. "శా॥ ఏరా తమ్ముఁడనన్నుఁజూడఁ జనుదే పెన్నాళ్ళనో యుండి..." (పాండురం. 3 ఆ 33) ఎన్నాళ్ళు, ఇన్నాళ్ళు, అన్నాళ్ళు, ఒక్క—జా. వి. "ఎన్నాళ్లు. దే-వి-బ. (ఎన్ని + నాళ్లు) ఎన్నిదినములు" (శబ్దరత్నాకరము)

3౫౫ సన్మానమ్-న-ఆదరే. అసన్మానా త్తపోవృద్ధిః సన్మానాత్తుతపః క్షయః। అర్చితః పూజితో విప్రో...(సచ్ఛ్రతత్ మానంచ=సన్మానమ్)...(శబ్దార్థచింతామణికోశము). "సమ్మనోరథసిదిసమ్మానితునిగ" అనియుఁ బఠింపనగును. "ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు. ఉ.కమ్మనిలతాంతములకు మ్మొనసి...(భార-ఆది-౫ఆ)(ప్రౌఢసంధి-౨౨సూ) లేదా యప్పకవితలంచినట్లు "బింద్వంప్రవదంత్యేతం క్వచిత్కేచిత్" అనుచెప్పున "నం మనోరథసిద్ధి సమ్మానితునిఁగ" అని పఠించి యనునాసిక ప్రాసమునంగీకరించినను నంగీకరింపవచ్చును. (చూ-అప్పకవీయము. 3ఆ 340-342; 5ఆ 159-161).

3౬౯ తురకచారులున్నచోటు సమీపించుటంజేసి యలికిడి చేయకుండ నడచెనని భావము.

పగిదిని నిశ్శబ్దముగ నడుగిడుచు
భటులు చూపిన తుంగభద్రతీరంపుఁ
దలమున కరిగి యాడరి మాటలాడు
తురకల మెలుఁగులఁ బరికించి భటుల
నలుగెలంకులఁ బొంచి నిలువంగఁ బంచి
యరచేతఁ గార్యంబు నదిమిన క్లెంచి
వేఱొక్క పొదఁబొంచి వీనులం దెలిపె.
"అన్యోన్యస్వైరంబు లల్లి సుల్తాను
లందఱు నరకాల నదిమి తూలించు
మాయావియౌ రామరాయండు, విజయ
నగర సామ్రాజ్యంబునకు జీవగఱ్ఱ,
యెద రెదురును లేక నిదురించుచున్న
యలసదాశివరాజు ప్రాణపంచకము,
మనవన్నినట్టి యీమాయయంత్రము నఁ
దవిలి విషానలదగ్ధుఁడై సమయు.

---

౩౬౪ వసు-విమ ౧౪౬ పుట.

౩౭౦ జీవగఱ్ఱ:—"ఇదియనింద్య గ్రామ్య (వైరిపద) మని పలువురంద్రురు....జీవ=వీణ మొదలగు వానితంత్రి చక్కఁగా మ్రోఁగుటకుఁగాను దానిక్రిందనుంచెడు కంబళిపీఁచు లోనగునది. దానినుంచుటకుఁగాను బెట్టినకఱ్ఱకు జీవగఱ్ఱయని పేరు...."(బసవపురాణపీఠిక.) "జీవ-సం-వి--ఆ-స్త్రీ।వీణమొదలగువానితంత్రిచక్కఁగా మ్రోఁగుటకుఁగాను దానిక్రిందనుంచెడు కంబళిపీఁచు లోనగునది"(శబ్దరత్నాకరము) "జీవా-ఆ-సీ-వీణాతంత్రీజీవా" (సర్వశబ్దసంబోధిని) సీ.శ్రుతికి నుత్కర్షంబు చూడంగవలయుచోఁ జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ। (క్రీడాభిరామము. బస-పీ).

కార్యమ్ము నడపు మార్గమ్ములం దెలుపు
కతపత్రమిదె కొమ్ము కడు వేగవామ్ము"
అనుమాట లాలించి యద్భుతానంద
సంభ్రమంబులు గడున్ సందడింపంగ
మృగయుండు తేఁచుల తెగయు, మృగాళిఁ
గవిసినరీతి గ్రక్కదలి సంక్రోత్తి
తోడ్తోడ బంటులతోఁ జుట్టుముట్టి
పట్టిసంకెలలతో బంధించి వారి
కడురహస్యంబులౌ కతపత్రములను
గైకొని చెఱఁబెట్టఁగాఁ బంచి మరలె.

♦ ♦ ♦ ♦

శ్రీరామభూపాలనిర్వ్యాజ విశ్వాస
సంధానపటుకార్య సంసిద్ధి శక్తి
యావేశమున నఖండానందవార్ధి
నోలాడు; సంకల్ప జాలసౌధముల

---

౩౭౫ రామరాయలకు విషప్రయోగము చేయు మార్గమా కత పత్రమం దనఁగా లేఖలోఁ గలదనిభావము.

౩౭౭ తేఁచుల తెగ=తేఁచులసమూహము.

౩౮౦ ఆశంఖధ్వని భటులను రప్పించుకొనుటకు గుఱుతనిభావము.

౩౮౯ ఏతన్మహా కార్యసంతుష్ట రామరాజ దయాపరిసారవిశేషము మాల్యవతీ ప్రాప్తిసాధన సామగ్రియగునట్లు పెక్కులగు నూహముల నూహింపసాగెనని భావము. వీరసింహుఁడు తలఁచిన కర్తవ్యములలోఁ బ్రధానమైనది నెఱవేఱెనని యెన్నదగును- చూడు ౧౧౦ పాదము.

మాలికలను వేనవేల నిర్మించుఁ;
దనకృతకృత్యతఁ దాన మన్నించు,
నూనూఁగు మీసల నులివెట్టికొంచుఁ
దలయూఁచు; నిలుచు; మిన్నులఁ జూచునతఁడు.
వనలక్ష్మి యానందపరవశ నతని
నలరింప నదె మంచియదనంచు నెంచి
చంద్రికాచందన చర్చఁ దేలించి
ఘనసారతరురజఃకణములం జల్లె;
తరుణపల్లవములన్ తాళవృంతముల
నల్లనల్లన యార్చి యలఁత మాయించి
శీతాంశురుచులను జిలికించి గంధి
లములైన మందానిలములఁ ద్రావించె!
పచ్చిక సెజ్జలం బచరించి మీఁదఁ
బారిజాతసుమంపుఁ బఱపులం బఱచె;
సెలలు మృదంగంబు చెలువునన్ మొఱయు,
నాపగాసరణ ముపాంగమై మ్రోయు,
భృంగీరుతుల్ గాఁగ సంగీతకృతులు,
వాయుకంపితలతావారసుందరుల

౩౯౩ మాల్యవతీ ప్రాప్తినిదాన భూతకౌర్య సిద్ధిజనితానందానుభవ సమయమున శృంగారోద్దీపన భావాకలన పూర్వకతత్రత్యా కృతకౌతుక్య ప్రదానగానసభా ప్రదర్శన వర్ణనము చేయఁ బడుచున్నది.

నాట్యంబు చూపి యానందింపఁ జేసె.
వనలక్ష్మి యొనరించు వలపించు సేవ
చేయూఁతయై రేపఁ జేతోభవుండు,
జవ్వనం బనుచేటి సవరింత నలరు
జగమెల్ల మఱపించు జిగిమేనిసొంపు,
కనుఁగల్వ లలరించు కాంతులన్నించు
మోముపున్నమచంద్రు మురిపెంపు పెంపు,
రతనాల పూల మాల్యములఁ గై సేయు
కటికిచీఁకటుల యుంగ్రముల కీల్కొప్పు,
పలుచని వాతెఱ పవడంపుఁదీవ
చిఱునవ్వు తెలిపూల సిరిఁగాంచుసౌరు,
వీనుల కమృతంపు సోనలై కురిసి
చిత్తంబు చివురింపఁజేయు పల్కులును,
మోమున కొకవింత మురువిచ్చు చూపు
లడరింపఁగాఁ జేయు బిడియంపు బెళుకు,
నాదిగాఁగలుగు మాల్యవతీలతాంగి
రూపవిలాసముల్ రూపింపఁ జేసి
వీరసింహుని యెద విహరింపసాగె.
భూమల కొకవింత పొలపమౌ భూష,
మదిరకు మైకంబు నొదవించు మదిర,
యక్షుల నలగించు నమృతాంజనంబు,
చిత్తంబు చొక్కించు సిద్ధౌషధంబు,
జన్మసాఫల్యంబు సాధించునోము,

లావణ్యసీమ, విలాసాతిభూమి,
లాలింపు మాల్యవతీలలామంబు;
చరియింపు మాకాశసౌధంబులందు;
విహరింపు మానందవీచులందూఁగి;
మనస, నీవింకను వెనుదీయనేల?
కన్నతల్లివితానఁ గాంక్షించుకన్న
మున్మున్న కోర్కుల మొలకలెత్తించి
యవుఁగా దనెడిభీతి యాత్మసీమాంత
ములనేనిఁ గననీక యలరించుచున్న
భాగ్యదేవత దయావాత్సల్యములకుఁ
బాత్రమౌ నాకు దుష్ప్రాప మేముండు.
బీజపూ రెక్కైన వెడలి మున్ముందు
సుచిరోపవాస చక్షులకుఁ బారణగ
మాల్యవతిం గాంచి మద్భాగ్యరేఖ,
రాఁబోవు విద్యాపురాధీశవిజయ
లక్ష్మీస్స్వయంగ్రాహలగ్నంబె మనకు
సుముహూర్తమని తెల్పి సుకటిలాలించు
టదిలెన్న యనుకూల మగుఁగాక నియతి.

♦ ♦ ♦ ♦

---

౪౪౪ ఉపసర్గసంధియు—చంద్రికాపరిణయమునందు, "అంతటరుక్మ బాహు వసుధాధిపనందన యొక్కఁడు......" "...। భానుసహస్ర భాసివృషభాధిపుఁ డెన్నటు లగ్ధయుక్తమో।..." (అప్పకవి. 3అ·183 184) "ప్రాయసప్రసా। రాతరసప్రసారరుచిర ప్రసరంబుగ సారెసారెకున్" (అల్లసానిపెద్దనయుత్పలమాలిక).

# వీరసింహుఁడు.

## ద్వితీయగుచ్ఛము—ద్వితీయపుష్పము.

వీరసింహుండు రంగారాయచరణ
సరసిజాతంబుల శిరసావహించి
సార్వభౌముఁడు తన్ను సైన్యాధిపతిగ
సమ్మతించి యొనర్చు సన్మానములను
శ్రోత్రపర్వముచేసి సులతానుచేయు
రాచూరుముదిగండ్ల రాయబారంబు
నకు సదుత్తరమీయ నరనాయకుండు
తను రాయబారిగాఁ జనుమంచుఁ జెప్పి
పంచిన కార్యంబు భారముందెలుప,
“వచ్చినదేది! మేల్పచరించుటేది!
రారాజు మదికెక్కి గారాము గనఁగ
విద్యాపురీప్రాణవిభు నంగరక్షఁ
గావింపనగు వజ్రకవచంబ యాచు

---

౪౪౮ రంగారాయచరణ-“స్వరూపతస్సమాసః స్యా। ద్వికారస్యకృతా. వపి” (వికృతివివేకము. ౧౩౪ పుట, అహో ౪౧౭ పుట).

౪౪౯ శిరసావహించి చూ ౨౪౦-పా.

శ్రీరామరక్షకు శ్రీరామరక్ష
యై వీరసింహుండు యశ మొందునట్టి!
భక్తి విశ్వాసార్జవంబులం బ్రజ్ఞ
భూషితు నీదృశుం బుత్త్రుఁగా నెన్ని
కొడుకులులేని యక్కొఱఁత పోనాడి
ధన్యుండ నైతి సన్మాన్యుండ నైతి'.
అనిపొంగు చాత్మలో నారంగరాజు
తనమిత్రు నెదనెంచి తనయునిం దిగిచి
యొకకంట నానంద మొకకంటఁ గరుణ
౪౭౦ యొలుక డగ్గుత్తికం బలికె నీరీతి:
గుణములప్రోవైన కొడుకు నిం దిగిచి
యొరసి యాశ్లేషించుచున్న నెచ్చెలిని,
గని వినోదించు భాగ్యముఁ గూర్పఁడయ్యెఁ
గనుకట్టుఁడనమునఁ గానివిధాత;
సాధింపు రాజాజ్ఞ సాధింపుమయ్య;
జయమంగళంబౌతఁ జనుమార్గమెల్ల.

---

౪౬౧ తురుష్కాచార క్రియమాణ విషప్రయోగము నాపుటమున్నగు రీతిని రామరాయల ప్రాణములఁగాపాడెనని భావము. "శ్రీరామ రక్ష వెయ్యేండ్లాయుస్సు" అనువాడుకకలదు. "రణమహీస్థలికి శ్రీరామరక్ష" (మనుచ-౪-ఆ ౧౦౭) రామరాయల లోకరక్షణ వ్యాపారమునకు సంరక్షకుఁడయ్యెనని యర్థము. లోకప్రసిద్ధ శ్రీరామరక్షకు శ్రీరామరక్షయయ్యెనని విశేషార్థము.

౪౭౫ "పారియేణాత్యంతకస్సాధిగ్గమేఃస్థానేప్రయుజ్యతే" (సాహి.ద.)

శ్రీరాము నాజ్ఞప్తి శిరసావహించు
నల యంగదువిభంగి నయ్యైనాత్మజ్ఞు
లులుకంగ నేర్పునం బలికి సందేశ
మును నిసృష్టార్థుండ యనిపించుకొన్న.
ప్రత్యర్థిమర్మ సర్వస్వ విజ్ఞాన
విశ్వాస వాగ్మితా విక్రమంబులకుఁ
బ్రాపౌట నీకె యర్హత చెల్లునంచు
నెంచి రారాజు నిన్నంచినందులకుఁ
జక్కటి నేరీతి సాధించుకొందొ?
వాంఛితం బేరీతిఁ బండించికొందొ?
అపకారమందిన యవినీతులైన
తురకల యుల్లముల్ దూఁటువోనాడి
యాత్మరక్ష యదెట్టు లాచరించెదవో?
సులతానలీపట్ల నలువురుంగలసి
యుంట మున్నటిరీతి గొంటసాహసము;
రామరాణ్మత్త వారణము తొల్లింటి
వహి నిరంకుశవృత్తి విహరించుచుండు;

---

౫౭౭ అంగదసామ్యముచే నరులకుఁ బట్టువడరాదని సూచించి నాఁడు. శిరసావహించు-చూ. ౨౮౦ పాద.

౫౮౦ నిసృష్టార్థ=కార్యసాధనస్వతంత్రుఁడగుదూత. నిసృష్టార్థో మితార్థశ్చ। తథా సందేశహారకః। కార్యప్రేష్యస్త్రిధా దూతో। దూత్యశ్చాపి తథా త్రిధా॥ ఉభయోర్భావమున్నీయ। స్వయంవదతి చోత్తరం। సుశ్లిష్టం కురుతే కర్మ। నిసృష్టార్థస్తు స స్మృతః। (సాహిత్యదర్పణము).

౫౮౫ చక్కటి=కార్యము.

౫౮౭ భావినిజరుగనున్న వీరసింహుని కారాగృహప్రవేశమునకు బీజము సూచితమగుచున్నది.

అరయ సందేశవాక్యముల నైఖరులఁ
బొందు గాఁగల దనంబోలదే కాదె?
చాలు నసంభావ్య సంభావనముల;
కల్యాణము నె విధి కల్పించుఁగాక;
హిందూల సామ్రాజ్య మేకాతపత్ర
మెత్తిన నొకపల్లె యెత్తిన గొడుగు
మునిఁగింప కపకీర్తి మునుఁగునే నియతి.

♦ ♦ ♦ ♦

---

౧౯౦-౧౯౬:—విజయనగర విధ్వంసరూప పర్యవసానము సంభావితమగు చున్నది.

౧౯౬ విషాదపర్యవసాయి యగునింక యుద్ధపరాజయము కానున్నది గాన, రామరాజ వ్యాపారనిందా పూర్వకముగ భావి పరాజయాదికము సంభావించి యట్టి యమంగళ సంభావనమును దూలించి మాంగళ్యము నాశీర్వదించికొని చిత్తచలనమును నిరసించి కొనెననుట.

౧౯౭ హిందూల—"హిందూరాజ్య రమాధురంధర" (మను చ 3 ఆ ౧౮౨ ప). అను చొప్పున హిందూశబ్దము సయుక్తముగలదు. దేశ్యమునననగును. కాన దీర్ఘరూపమును నుండవచ్చును. లేదా "హిందుల" అను పాఠము నంగీకరింపవచ్చును.

౨౦౦ విధియట్టి దుష్కార్యమును జేసి నిందాపాత్రము కానోపదని భావము.

# వీరసింహుఁడు.

## తృతీయగుచ్ఛము — ప్రథమపుష్పము.

బలుబొజ్జ మెకములం బొలియింపఁజాలు
పలితంబ యనఁబోలు తెలిజూలు ఱ్రేలు
తెఱనోటి మెకములం దొలింపఁజాలి
గజవాజి నృపతులం గళియంగ నోడు
గఱచుచుఁ గారోష్ణ గడ్డముల్ నిగుడ
గుమిగూడు వింతైన గొదమసింగములె
యవు నుమ్మరావులు దవిలి సేవింప,

౫౦౧ బలుబొజ్జమెకము—ఏనుఁగు కొడుపు పెంచుట మర్బలతాలక్షణ మనియు నట్టి యేనుఁగులను జంపుట సింహములకొక ఘనత గాదనియు భావము.

౫౦౩ తెఱనోటి మెకము=సింహము. నోరు, వెళ్ళఁబెట్టి, నాల్కఱ్రేల వైచి యుండుట వ్యాఘ్రకలక్షణ రూపమర్బలతా చిహ్నమని తాత్పర్యము.

౫౦౪ లోకసామాన్యసింహ ప్రదర్శిత దౌర్బల్యచిహ్నములకుఁ బ్రతి ద్వంద్వములగు సారవత్తాలక్షణములు వరుసగాఁ జూపఁబడు చున్నవి. తురుష్క వీరసింహము లశ్వపతి గజపతి నరపతులపైఁ గవియు వింతప్రభావము గలవని భావము. ఓడు గఱచుట ధర్షణ లక్షణము.

౫౦౭ ఉమ్మరావులు=మహాబలశాలులగు తురుష్కవీరులు.

బిజపూరు దరినుండు బీకులన్విడిచి
బీదరహమ్మదాబాదు గోల్కొండ
బీజాపురీశు లభిన్నులై చేరి
కర్ణాట సామ్రాజ్య కల్పవృక్షంబుఁ
గూఁకటివేరుతోఁ గూల్పంగఁజాలు
కుద్దాలములుఁబోని కోఁఅమీాసముల
నులివెట్టుకొంచు నుమ్మలికతో రామ
నరనాథుగరువంపు నడతరోయుచును,
'నిత్యజయంబుల న్నిర్భకుఁడగుట
గర్వప్రమాదాంధకార సంఛన్న
మానసుండౌచు నేమఱియుండుకతన
నాతండు సుజయుఁడౌ' ననుకొంచు, నిర్ణి
మేషులై సింగపుం బీఠంబులందు
నొరగి కర్తవ్యంబు యోజించుచుండ,
శత్రు పంచానన శరభాయితుండు
వీరావతారమా వీరసింహుండు
దౌవారికముఖానఁ దనరాకఁ దెలిపి,
వ్యూఢంబు లౌచమూవ్యూహంబులనెడి
ప్రాకారములలోని ప్రాకారములను
దాఁటి, సుల్తానులం దఱిసి, యథార్హ
ముగఁ బల్కుఁగాసాగె మోమోటదక్కి,
ఘనగర్జితోపమ కంఠస్వరమున

వారిధి గంభీర వాగ్గుంభితముగ:
"మూరురాయరగండ వీరప్రతాప
బిరుద భూషితులైన విద్యాపురీశు
లస్మన్ముఖంబున నానతింజేయు
సందేశమును మీరు సావధానముగ
వినుఁడయ్య" "రాజ్యంబు వీరభోజ్యంబు
కావున నిర్మరలేకచ్ఛత్రమహాట,
దక్షిణాపథమునం గక్షుఁగట్టుటకు
సైఁపకున్నది మాదు సామ్రాజ్యలక్ష్మి;
జీవితంబులు మీకుఁ జేఁదుగాకున్న
నడఁగి మడంగి యుండుఁడు; కాదయేని,
వీరులై తనువుల విడుఁడాజినిల్చి;
తరతరంబులుగ నంతర్వేది, విజయ
నగర సామ్రాజ్యంబునం జేరియుండఁ
గూళయై సలక భూపాలు మూలమునఁ
గొలఁదికాలంబాఁచి కొనినంతమాత్ర
రాచూరు ముదిగండ్ల రాయబారంబె.

---

౧౪౦ ఖండా ఖండ ప్రాసము మహాకవిసమ్మతము కం॥తగ...నా। సఁగె...। అగణిత...। (ఆశ్రమవాస) ఆ_౨. ౧_౨౧ ప).

౧౪౪_౫అంతర్వేది=కృష్ణా తుంగభద్రామధ్యరాష్ట్రము. (చూ. వసుచరిత్ర విమర్శనము ౧౪౧ పు).

కదనంబులం దోడి కార్యార్థులౌచు
నణఁగి పందతనాన నరివెట్టివానిఁ
గాలూఁది యుంటిరిగాదె యిందనుక,
దురభిమానంబునం దొడరితిరేని,
పిఱికులై శరణన్నఁ, గఱచినం బూరి,
కేలెత్తి పాఱినన్, ఘృణచూపమింక"...
అర్థోక్తిలో నాఁగి యడరు నాఱేండ్ల
జేవురించిన మోముఁ జెందమ్ము లపుడు
మర్మభేదకవాక్య మారుతోచ్ఛ్వలిత
ములసంగఁదగి చలాచలము లౌచుండఁ,
దద్వచః ప్రజ్వలిత క్రోధవహ్ని
దందహ్యమానహృజ్జ్వాలావితాన
మత్తులం బర్వె నోయన నెఱ్ఱసెరలు
కనులఁ గ్రాలుచు దృష్టికైతవంబునను
విస్ఫులింగంబులన్ విరఁజల్లుచుండఁ,
గోపానల జ్వాలికాపీతమగుచు
నలవివేకోదకం బంతరింపంగ
వార్తాహారనికార పంకాభిముఖ్య
మునఁ దురుష్కులు నల్వురును నొక్కపెట్ట

---

౫౪౭ వసు. విమ. 142 పుట. ,,సీ|| పదిలుఁడై రాచూరు ముదిగల్లుఁ గప్పంబుపేయఁ గాంచి సపాదుసీమనిలిపె|" (నరసభూ ౧ ఆ 82 ప).

"పోడుఁడు! కాల్పుఁడు! వీనిఁ బోనీకుఁడింకఁ!
గొట్టుఁడు! కట్టుండు! పెట్టుండు బంది;
ఎన్ని కారులు ప్రేలె నిట నెట్టయెదుట!
రాయబారపు మార్గమే యిట్టిదురుసు!
రాచ పొగరోర్వఁతు రామరాయనికిఁ
గలుపఁగా వలె బుద్ధి చెలు నొందిచి వీని,
ముచ్చిమి నన్నన్ని రోధమ్మువాసి
మన చారులనుబట్టి మాయించువాని;
త్రుళ్లుచు రాయబారులను దూలించు
రామరాజునకిదె రాజనీతి యగు."
అనునంతఁ గనులంట నదరులుసెదర,
నదరంటమేన, మిన్నంటంగఁ గోప,
ముగ్రుఁడై శితమండలాగ్రుఁడై యుమ్మి
రావులు డగ్గఱి రానోడుచుండ
వీరసింహుండు నిర్భీకుఁడై పలికె
"బార సాఁచుచు నైదుపదులు గావించి
యాత్మార్పణము సేసి యయ్యో, బాబంచుఁ
బలికెడు నోళ్ళిట్లు పదరంగనౌనె;
బాహాబలము చూపి పగఱనోడించి
కసిదీర్చుకొననౌను గాక వీరులకు,
గూఢచారుల నంపి కుచ్చితంబనక

౫౭౨ చూడు-౧౯-౨౦; ౩౮౦-౩౮౪ పా.
౫౮౨ వసు చ. విమ. ౧౪౩ పుట.

చిలుమిచ్చి యరిఁగూల్పఁ దలఁపంగ నౌనె;
ఆ్రముచ్చు చారుల నాతతాయులను
బట్టి యొప్పించినన్ వధియింపఁడయ్యెఁ!
౫౯౦ గలియుగ రాముఁ డాకరుణాంబురాశి;
ఆనీచకృత్యంబు నాత్మలో డాఁచి
కొనక సాటులు చెప్పికొనఁ జూతురయ్య!
దూతలం ద్రుంగించు దుర్నీతిపరులు;
ఆసన్నమయ్యెఁ గా యవసానకాల,
మీా మాత్రకే నేల భూమీశునాజ్ఞ
లేకయే చెయిసేయు, లోకంబుతోడ
మీాదుర్నయము రామమేదినీశ్వరుఁడె
యరసి శాసించుఁగాకని చూతుఁగాక"

♦ ♦ ♦ ♦

---

౫౮౪ చూడు ౩౨౮ పాదము.

౫౯౫ నాయకశూరత కపకర్ష లేదని భావము.

# వీ ర సిం హు ( డు.



## తృతీయగుచ్ఛము—ద్వితీయపుష్పము.



గగన సౌధంబులన్ గాలిమేడలను
విహరించి తేజున వెలిఁగించి దిశలఁ
జరమాద్రి కినుఁడేగి సమయోశుచేతఁ
జెఱఁబెట్టఁబడఁ దమ్మిచెలియతోఁపాటు
భూతచేతోబ్జముల్ ముకుళింపసాగె.
ఐంద్రజాలిక వస్తుసందోహ మనఁగఁ
జాక్షుషవిశ్వంబు సకల మొండొండ
సురుఁగంగసాగెను జూచుచుండగఁనె.
దృశ్యప్రపంచంబు తిమిరాఖ్యయోగ

---

౫౯౯ గాలిమేడలు—ప్రవహవాయువు వశమున గ్రహములెల్ల నడచుచున్నవని భావము. శౌర్యసిద్ధులచేఁ గల్గునానందమున మిన్నందియుంది కీర్తి ప్రతాపముల దీపించి వీరసింహుఁడు తురుష్కులచేఁ గారాబద్ధుఁడు కాఁగా మాల్యవతి విషాద పీడిత కానున్నదని విశేషార్థము నెన్నునది.

౬౦౪ సంయుతా సంయుతప్రాసము—,,శా....ధీరసంగ్రామకుం। డీ త్రైలోక్యమునందుఁ గల్గఁడు రణంబెచ్చోట లేకుండఁగాఁ। జేతుర్వేయు వృథాభరంగుట వచ్చెన్ దేవ యీమేనికిన్"
(ఉ. హరి).

నిద్రావిలీనమై నిశ్చలత్వంబుఁ
గలిగింప విరహియోగుల కిష్టవస్తు
దివ్యరూపంబొందె దీపింపసాగె.
అటబీజపురిని మాల్యవతీ లతాంగి
వీరసింహుని కాత్మవిభునకుం బ్రీతి
జన్నియగట్టె తాజవ్వనంబెల్ల,
వలరాచరాచ వారలదాడి కోడి,
వలవంతఁ గుందుచు వసివాళ్లుగనుచుఁ
ద్రుటియొక్క కల్పంబు నటువుచ్చుచుండి,
తద్దివ్య రూపంబె తలపోసిపోసి,
తనిసి తత్సాయుజ్యమును గోరికోరి,
తత్కటాక్షామృత ధారాభిషేక
మునఁ దాపమునుదీర్చికొన నెంచి యెంచి,
జగమెల్ల మఱపింపఁ జాలుతదీయ
సంసేవనాఖండ సామ్రాజ్యపదవి
నంది బ్రహ్మానంద మందెదనంచు
మనికిగా విరహాగ్ని మధ్యంబె తనకుఁ,
దన్నామ దివ్యమంత్రంబె జపించు;
తనిసి తద్గుణముల మననంబుచేయు;
నీరంధ్ర శేముషీధారంబుగాను
ధ్యానించిధ్యానించి తన్మయత్వమున
విశ్వంబుఁ గనువాని విశ్వరూపముగ.
ఆమానసికమూర్తి నభిముఖుం జేసి,

"విద్యాపురికినీవు వెడలుకాలమున
నరిసంహారణ దీక్ష పరిపూర్తిచేసి
పితృపరతంత్ర, యేవెరవుననైనఁ
జేకొందు నిన్నని వాకొంటిగాదె!
అదె వేదమనుకొంటి; నడియాసనుంటి;..."
అంచు విజ్ఞాపించి, యంతలోఁ దెలిసి;
వెల్లనాచు నిరాశ నల్లాటమందు.
"ఉదిరిబంగరు కాంతి నదలింపఁజాలు
జగమెల్ల వలపించు జిగి మేనివాఁడు,
౯౮౩ శారద పూర్ణిమా సంపూర్ణచంద్రు
నవుఁ గాదనఁగఁజాలు నవుమోమువాఁడు
శృంగార విభ్రమ శ్రీ తాండవించు
కంజాతములఁబోని కనుదోయివాఁడు,
సద్గుణంబుల రూప సౌవర్ణభూష
వాసింపఁగాఁ జేసి వలపించువాఁడు,
నా మోహనాకారుఁ డావీరసింహుఁ
డాసింపఁ దగువాఁడె! యలఁతి మాల్యవతి!
అందనిపండ్లకై యఱ్ఱెత్తువారె!
నోమకే ఫలములం గామించువారె!

---

౯౮౧ పద్మాలయ యగు శ్రీ కంజాతములందుఁ దాండవించుట యర్థామెగదా.

రణరంగ పరకంఠ లవనలాస్యముల
నలరింపఁగాఁ జాలు నసికన్యయొకట,
నుత్సాహ జలధిలో నోలలాడించి
తొల్యంబునిడు వీర లక్ష్మియొక్కటను,
నాచంద్రతారంబు నాచంద్రతార
కాంతులందగు కీర్తి కాంతయొక్కటను,
రారమ్మ నన్నుఁగొమ్మ వీరాగ్రగణ్య
యని వేఁడుచు స్వయం గ్రహాశ్లేష మొసఁగి
చొక్కించు చుండంగఁ జూచునే నిన్ను!
వన్నెవాసులవారి పజ్జ నిల్చెదవె!
వారిఁగాదని నిన్నుఁజేరి మోదింప.
చాలునీ వేదుఱు! చాలునీ వెతలు!"
అనియిట్లు తలముస్కు లౌనటవంత
యలలలోఁబడి యామె యారటించు నెడఁ,
జెలిమేని కోకవింత చెలువంబునిచ్చు
వలపువేదుఱు దాని మొలపించువాని
నలమాల్యవతి బహిః ప్రాణంబులైన
సకులెటింగియు నెఱుంగక యున్నయట్లు
రమణి మందాక్షు సామ్రాజ్యాధి పత్య
మునకులోనై యంతదనుక లోలోన

౬౫౦ తుది కని కన్యావరణమె సంభవించెనని ధ్వనిత మగుచున్నది.
౧౬౭ ౫ పా. చూ.

వీరసింహునిఁ గూర్చు వెరవు లారయుచు,
విధివశాన నతండు బీజాపురమునఁ
బండగులోఁ డాలు పంచాస్యమనఁగఁ
జెఱఁబెట్టఁ బడియుండు జీర్ణింపనుంట
నరసి యంతకుమున్నె తురకతేండ్లెల్ల
విద్యాపురికి దాడి వెడలి యుండుటను,
బందీగృహాధ్యక్ష పదవి లోనున్న
యమ్మాల్యవతి తండ్రి తిమ్మ భూపతియుఁ
జనియుంటఁ జేసి విచ్చలవిడింగార్య
సిద్ధిని బిడికిలించితి మంచు నెంచి,
సకియ నీరీతి నాశ్వాసించి రఘుఁడు.
"సమముగా ఖేద మోదముల పాలొసఁగు
వారలే సుమ సఖీపద భాజనములు;
మనసున కంధాతమసము కానిమ్మ
మాకుదాఁచుట నీకు మానితంబగునె;
శయ్యాసఖీమాత్ర సాక్షికంబైన
వలపు నీయాకృతి వెలిపుచ్చకున్నె;
మానసంబను వెన్న మరువెచ్చమటెఁగి
పొంగెనాఁ గన్నీరు పొర్లి పాఱంగ,
మఱిగి యాత్మేశు నిద్దురలేక తిరుగు

---

౬౩౩ "అంధా తమస్. న. అత్యంధే. మహాంధకారే. అంధంచతత్తమశ్చ. అవసమంధేభ్యస్తమస ఇత్యచ్. అన్యేషామపీతిదీర్ఘః" (శబ్దార్థచింతామణికోశము)

౬౨౨ బండగు=బోను.

మనముపైఁ గినుక నాఁగను లెత్తువాఁడు,
విరహాగ్నిపుట పాక పరిహీణమగుచుఁ
దనుసువర్ణము వింత తళుకులీనంగ,
స్మరవిభావసు దీప్తిమై ముఖేందుండు
వెల్లఁబాఱియు వింత వెన్నెలల్గాయ,
మరుచింతఁగ్రాఁ సేఁతమానుటల్ మేని
కొకవింత సింగార మొదవించుచుండ,
స్వాంతంబులో డాఁగురింతలాటాడు
ప్రాణేశుఁ గలకన్న బయులుపుచ్చంగ,
డాఁగురింపఁగ నింకఁ దడఁబాటిదేల?
మరియు దాఁచుటకిందు నెరసేమికలదు?
కానోపుదాని నాకాంక్షించితీవు;
లోకోత్తర గుణోత్తరుఁడు వీరసింహుఁ;
డనుపమ గుణరాశివగు దీవు తరుణి;
నిరుపమ లావణ్య పరసీమయతఁడు;
లావణ్య చంద్రికా లహరి వీవతివ;
కనుల విందొనరించు కలువ నెచ్చెలియ
కమ్మవిల్తుని మామఁగాంక్షింపకున్న;
వలపులం జిలికించు పద్మినీకాంత
బాలభాస్కరుఁగోరి వసివాడకున్న;

---

౨౦౦ ,,మఱియు నొక్క సాలమిరుగేలఁ బెటికియు (భాస్కరరా. అర-౧౪-౫౭౨)

౨౦౪ పురుషుల విషయమునను లావణ్యము వర్ణింపఁబడును. శా॥ ఆ లావణ్య మగణ్యమాగుణ...శ్రీనారసింహాధిపున్ (నర ౪౪ ౨౮)

౨౧౦ ఇంతయే లాతంట కాంత నీరూప
రేఖావిలాసముల్ తిలకింపలేదె;
తిలకించి మదనాగ్నిఁ దెరలుకుండుటకుఁ
బరమ హంసయెవాఁడు పరమాణుమధ్య;
రసిక శిఖామణి కుసుమ సాయకుఁడు
మఱవంగనిచ్చునే మఱచిన న్వాఁడు;
సమ తులారోహంబు సవరింపఁజాలు
సోయగంబులనున్న మీయిర్వురకును
దాంపత్య మీమికి ధాత వెంగలియె;
త్వన్మనోరథములన్ స్వారి వేంచేయు
౨౨౦ నావింత రాహుతు సరసి తేరంగ
మఱుచింత లేక వేమఱు చింతలూని
౨౨౨ యున్నారమనుకొమ్మ యువిద వేయేల!



౨౧౧ లరయుతి. ,,రాయంచ కొల్లఁదాలకయమున్న'' (వసు. ౪ఆ. ౨౫)
మ. భా॥రము నంబుచ్చుచు వర్థమాన విరహగ్లానిన్ మదింగుం
దుచున్ (పిల్లలమఱ్ఱి-శృంగార శాకుంతలము) ,,ఏతేన 'రాయంచ
కొల్లఁదాలకయమున్న' ఇత్యాది కవి ప్రయోగాణాంనకించి
దప్యసామంజస్య మితిధ్యేయమ్'' (అహో ౧౩౮ పుట) తోలు
శబ్దమె లేకుండుటచేఁ బైపాఠము సరికాదనియు ,,కలహంస
కొల్లఁ దవులకమున్న'' అనుపాఠమంగీ కర్తవ్యమనియు వసు
చరిత్ర టీకాకర్త వ్రాయుట (వసు. 3 ఆ ౧౬౨ పద్యపుటీక)
పొరపాటు "చ-సు। స్థిరునిను మాధవుం డనుమతి న్వెనుదాలెద
మాదరంబునన్" (రాఘవపాం 3 ఆ-శబ్దర).

# వీరసింహుఁడు.

## తృతీయగుచ్ఛము—తృతీయపుష్పము.

అలవిజాపురిని గారాలయంబందు
దీర్ఘచింతోర్మ్ములే దేహ ధారణము
పచరించు నిద్రాన్న పానముల్గాఁగ,
నిబిడాంధకారంబె నెయ్యెండుకాఁగ,
రాత్రిందివము కాళ రాత్రియుంబోలె
నేకాకృతిని దీర్ఘమై కానిపింప,
వివిధ చింతాబ్ధుల వెల్లులేకముగ
నుప్పొంగి యాత్మను గప్పుచుండంగఁ,
వీరసింహుండు దుర్విధి చెయ్దములకుఁ
గలఁగుచు, జీవిత కల్పావసాన
మునఁబోలె నాశలెల్లను లయంబంద,
దానితికర్తవ్య తామూఢుఁ డగుచు,
నలువంక లన్వేగ నడయాడుచంత,
నిలుచుచు నందంద నిట్టూర్పులిడుచుఁ,
బెదవులం దడుపుచు, మదిని గర్తవ్య
ములఁ దలంచి తలంచి పలవించునిట్లు:—

---

233 ఆశలు=ఆసలు, దిక్కులు.

"ఆకాశ సౌధ విహారంబు సేయ
నీవన్ను సంకల్ప సోపానపంక్తి
ప్రతికూల విధి గాలివాన నీరీతి
విధ్వస్త మాయెఁగా వీరసింహుఁడ;
మెఱపేని యొకకొంత వఱకుండు నంత
కన్న నీదు విలాస మల్పాయువగుచు
నవసి యుత్పన్న వినష్టఘటంబు
కరణి నయ్యెనుగాదె! క్షణభంగురంబు.
"అస్మ ద్విమోగ్రత్రియామ, యోచెల్ల!
తీఱెఁ బోమాల్యవతీ చక్రవాకి!
ఇదె లోకబాంధవుం డుదుటుసూపంగ
సమకట్టినని తెల్పి సకియ సేవించి
యొన్నండు నేఁగృతకృత్యతం గాంతు!
బిజపూరు దరినుండు బీబులన్విడిసి
చెలరేఁగి తురకల యొలుకలపిండు
గండుఁబిల్లికి మెడగంటఁ గట్టంగఁ

---

౨౪౪ పంచమీ విభక్తియతి (అప్పక ౩ఆ ౨౩౭ ప)

౨౪౫ ఉత్పన్న వినష్టఘటమును క్షణభంగురతా ప్రసంగమునఁ దార్కికులువ్యవహరింతురు.

౨౪౬ ఈకోర్కె నెఱవేఱెను. చూ. ౭౩౫ పాదము.

౨౪౭ లోకబాంధవుఁడు=రామరాయలు, సూర్యుఁడు.

౨౫౨ ఈకోర్కెయు నెఱవేఱెను. చూ. ౧౧౨౨ పాదము.

"భవేద్విరుద శబ్దేషు। యథేష్టం వర్ణకల్పనా, గ్రామమానుష్య బిరుద। శబ్దానామపిసో(సమాస) మతః।(వికృతివివేకము ౧౩౪ పు).

బన్ను పన్నాగముల్ ప్రభుపుంగవునకు
విన్నవించి వినోద మెన్నండుఁకూర్తు!
కఱకుఁ దురుష్కులం గరవాలధారఁ
గసిదీర నెన్నండు ఖండించువాఁడ!"
ననుచు నువ్విళ్లూరు ననువిధియిట్లు
కాలుసేతులు గట్టి కారనుంచెద వె;
స్వామి భక్తియు దేశ భక్తియుంగల్గు
కార్య క్షముండంచు గారాబమిచ్చి
రారాజునను(ఁ)బంప నీరీతి నేఁగి
విభునాజ్ఞ నెదిరింప వెఱపెంత లేదె;
అరె వీరసింహా నీయాశాలతలకు
బీజపురీయాత్ర పెను గాలియయ్యె;
వంచించి తురకల నొంచి తద్గూఢ
చారుల, నీవు రాఁజనునె యిచ్చటికి;
తుచ్ఛులయెడ మేలె దూత్యంబునడప
దూతలఁ జెఱఁబెట్టు దుర్వినీతులగు
తులువ తురుష్కులం బొలియింపకున్న
చండ శాసనుఁడైన మండలేశ్వరుఁడు
అదరు బెదరులేని యవ్వీరవరుఁడు
తనదూతనిట్లు సుల్తాను నొంపంగ
సాహసించు నటంచు శంకించుకొనున;

౨౬౩-౨౬౫ ఇట్టి ధైర్యముతోడనె రామరాయలు వీరసింహుని దూత్యమున కంపుటయు నాతండంచుల కియ్యకొనుటయు సంభవించెనని యెన్నవగును.

విద్యాపురికి దాడివెడలి రానున్న
కూళ తురుష్కుల గూఢ చారుండె
మాయల మారియై మనల నమ్మించి
మన రహస్యము లెల్లఁగొని పోయెనంచు
భావించు నొక్క యావసుమతీశ్వరుఁడు;
నమ్మించి తేనికి నన్నప్పగించు
నాయనగా రెట్టి నానఁగుందుదురో"
అనుచు ధీరతడించి యశ్రువుల్గనులఁ
గ్రమ్మంగ లోలోన నుమ్మలింపంగ,
నింకసీతని నొంప హృదయంబు వ్రీలి
యింతతోఁ దుదిముట్టు నిదిమేలెయంచు
దౌర్భాగ్య దేవత తరలి పోనెంచి
చెఱకవాటంబు విచ్చెననంగ నొక్క
మలకతటాలునఁ దలుపులం దెఱచి,
"పుణ్యవంతుఁడవైతి పొమ్ము నీవింక
నిర్దోషివౌట నిన్విడుమంచుఁ దిమ్మ
భూపాలు హుకుమయ్యె; పులినోటికండ
వయ్యుఁ దప్పితివి భాగ్యంబేమిచెప్ప!"

---

౨౮౧ రంగరాయఁడు ౧౯౦, ౪౬-౪-పాదములు చూ.

౨౮౫ దౌర్భాగ్యదేవత యాతని బీడించి పీడించి పిదపఁ దుదముట్టింప నెంచెనను భావ్యర్థము సూచితమగుచున్నది.

అనునంత నమ్మమి యబ్రంబు తర్క-
మర్థనిర్ధారణ మాత్మఁదోఁపంగ,
"తులువలౌ తురకఱేఁడులు వివేకించి
విడిచిపుచ్చుటకల్ల; పిఱికితనాన
దుర్ధర్ష రామరాడ్దుర్వారకోప
దావాగ్ని శిఖలకుఁదలఁకిరే కాక;
మొదటనేలొకొ యంతయుదుమ్మైన దుడుకు;
వెనుక ముందును యద్భవిష్య లెన్నదురే."
అనియిట్లు యోజించు చాత్మావమాన
మెంచి యాతం డుమ్మలించుచుండంగ,
మెఱసిన మెఱపు నాఁ దఱియుచు నొక్క-
లేఖ సమర్పించి లేమ యొక్కరిత
యట్టె యంతర్ధానమయ్యె; నవ్వాలపుఁ
గమ్మ సువర్ణలేఖా విలాసంబు
తో మాల్యవతియుఁ జేతోవీధిఁదోఁపఁ
దత్ప్రేమసార మాతండిట్టు లెన్నె:
"కడలేని కడగండ్లఁ బడి తడంబడుచు

---

౭౯౪ మాల్యవతియు సఖులును మాయచేసి విడిపించిరని వీరసింహుఁ డెఱుంగఁడు. కాన తురకలు విడుచుటను నమ్మకుండుటయు, విడుచుట కద్భుతపడుటయుఁ బిదప నాలోచించి రామరాయలకు వెఱచి విడిచియుందురని యర్థనిర్ధారణము చేయుటయు సంభవించెనని భావము.

నొడుదుడుకుగ వేళ గడపుచునుండు
నగుబాటు వాని నీముగుద ప్రేమించు;
ఈరూప మీదశ యీతత్తరంబు
గలవీని వలచినం గల్గునే సుఖము;
జగమెల్ల నేలంగఁ జాలునీసారు
వీరసింహుని కయి వితయాటచన్నె;
సోయగంబుల ప్రోఁక సుగుణాలజోఁక
జన్నె గట్టితె నీదు స్వాంతమ్ము నాకు;
తపసు పండుటగాదె తరుణిరోయిట్టి
ప్రణయ మవ్యాజంబు పడయంగనాట."

♦ ♦ ♦ ♦

---

౧౬ భావ్యనర్థసూచక వాక్యములి ట్లనభిప్రేతముగ నోట జాఱుట స్వాభావికము.

౧౮ 'స్వ + అంతము' అని యాంతరార్థము.

# వీరసింహుఁడు.



## తృతీయగుచ్ఛము—చతుర్థపుష్పము.



మదనాగ్ని పరితప్త హృదయంబు వీర
సింహుని దురవస్థ చెవిసోకునంత
ప్రిదిలి బీటలు వాఱఁ బ్రేమానుబంధ
మంతకంతకు వింతవంతలం బెనుప,
వలరాచ తలఁపుల యెలరెల్లనంతఁ
బ్రణయంపుఁ జేవగాఁ బరిణామమంద,
వీరసింహుని చెఱ విడిపించి చిత్ర
వధనుండి యాతని వారించుకొఱకుఁ
జిచ్చైనఁ బిడికిలించెదఁ గాకటంచు,
వివిధయత్నంబులం బెనఁగి వైఫల్య
మందుట న్విసిగి సాహసకృత్యమనక
జనకుని హుకుమంచుఁ బొనరించి మాయఁ
బ్రియముఖామృత కరోదయమునకై ప్ర
తీక్షించు మాల్యవతీ చకోరాక్షి:
తద్రూప భావనోత్తంభితంబైన
చిత్తంబు కేవలాక్షి ప్రణాళికలఁ

ప్రవహించుచుంటఁ దద్బాహ్యప్రపంచ
మంధకార నిమగ్నమగునట్టు లణఁగ,
నిముసమొక్క మహాయుగము పోలియుండ,
నిర్నిమేషాక్షియై నిష్పంద తార
యైవాని వచ్చుచాయనె దృష్టిఁ బఱపు...
మగువ మందాక్ష సామ్రాజ్యాధిపత్య
మొకింత యేనియు మొక్కవోనటుల
విస్మయాత్మ క్యాతి విభ్రాంతిహర్ష
దోలాధిరోహణాందోలి తుండైన
వీరసింహుండట్టి వేళనే తెంచి,
భావనారూప సేవాపరత్వమున
ముగుద లజ్జాసఖి యొగ తాళి గనక
జరపిన యుచితోపచారము ల్వడసి,
తలమునుకలిడు మోద జలధిలో మునిఁగి,
యుండె నిశ్చేష్టత నొక్కింత సేపు.
జగమెల్ల మఱచు నిశ్చలమానసమునఁ

---

౨౮౪ విశేష శబ్దార్థక విశబ్దముచే గ్రంథమధ్య మంగళమాచరింపఁబడినది.

౨౮౭ భావనారూపః— ,,శ్రుతశ్చ దృష్టశ్చ హరిత్సు మోహాత్, ధ్యాతశ్చ నీరంధ్రితబుద్ధి ధారమ్'' (నైషధకావ్యము).

౨౯౭ "సాక్షాత్-అ-ప్రత్యక్షే....సహ అక్ష్ణా. సాక్షః తమతతి క్విప్ ..." (శబ్దార్థచింతామణి).
"సాక్షాత్-అవ్య, సహ + అక్షతి. అక్ష-అతి. సాదేశః సహ అక్షమతతి. అత- క్విప్వా ప్రత్యక్షే..." (శబ్దస్తోమమహానిధి).

జిర నిదిధ్యాసన పరమాదరమున
భావింప భావింపఁ బ్రత్యక్షమగుచుఁ
దిరముగాఁ బొడకట్టి దేదీప్యమాన
విభుదివ్య మంగళ విగ్రహంబెదుట
సాక్షాత్కరింపంగ నత్తపస్వినికిఁ
బ్రణయామృతంపు టాస్వాదంబొసంగు
తనివి నివ్వెఱపాటు నెనయించెనంత;
ఆనంద రసవేణులంతరంగంపుఁ
గాసారమునునింపి కనుఁగొమ్మలెడలి
పాఱె నా మోదాశ్రు పరివాహమడరె;
సిరిమూలి కృషిసేసి తరుణి నెమ్మేన
వెదచల్లిన విలాస బీజంబు లంకు
రించెనో యనఁగ రోమాంచంబుదనరె;
లజ్జాను రాగముల్ మనమునంబెనఁగ
నమన మున్నమన మాననమునం బెనఁగె;
బిడెపుఁ జీఁకటి కొంత విరియఁదోల్ తెక్క-
విదియవెన్నెలనాఁగఁ బొదలెఁ జిర్నగవు;
మరుదుండగంబుల మనవి సేయంగ
నుంకింప దగ్గుత్తి కులికించుకతన
వాతెఱ యొక్కింత వడఁకంగసాగె;

---

౭౬౧ కనుఁగొమ్మలు + ఎడలి. కనుఁగొమ్మలు= కనుఁగొనలు, కనుల నెడి తటాకజలనిర్గమన మార్గములు.

అంతంత రేఁప నేకాంత ప్రవృత్తి
చిత్తంబు లొండొండ చిందులాడంగఁ
దిమ్మ ధరిత్రీపతి ప్రియామాంత
రాయంబునం గూడరా కుండరాక
యాజక్కవలజంట యల్లాటమందె.
మరు తేజమునఁ జేసి పరిపాకదశకు
వచ్చిన కల్పక ఫలమునుంబోలెఁ
దంగేటిజుంటి చందమునఁ గట్టెదుటఁ
గ్రాలు నమ్ముద్దియ కనువిందు సేయ,
రాగంబు లజ్జ హోరాహోరిఁ బోరు
చుయ్యాలలూఁప బై లుఱుకంగ లేక
పుయిలోడు చున్నయప్పొలఁతి నీక్షించి
మది వీరసింహుండు మన్నించె నిట్లు:
నిజసృష్టసుందరీ నికురుంబరూప
మణిహార నాయక మణిసృష్టికొఱకుఁ
దనశిల్పమునకు మే ల్తళుక్కలీఁజాలు
తమ్మి పూవిల్తు శిల్పమ్ము చేదోడు
వాదోడుగాఁ గొని వనజసంభవుఁడు
సృజియించిదీనిఁ దాఁగృతకృత్యుఁడయ్యె.

---

౭౯౮ మరుతేజమున:___విజాతీయ తేజస్సం యోగమునఁ బరిపాకము గల్గుననునది తార్కిక సమయము.

౮౦౩-౮౧౧:___ఏతత్కావ్య కథావస్తుకల్పనా విషయమునఁ దోడ్పడిన ధనుజుఁడగు చి॥ గోపాలరావు (M. A; L. T;) సాహాయ్యము ధ్వనితమగుచున్నది.

ఈరూప మిక్కాంతి యివ్విలాసంబు
నీయనురాగంబు నీబిడియంబు
వీరసింహుండ నీవిభవంబు లట్టె!
స్నేహపూరమున నజ్జీవితంబౌచు
నీజీవితపు దివ్వె నిలువ నీబేల
చింతాతమంబునఁ జేడ్పాటునొంద
వలసెఁగా పితృవాక్య వాటాంతరమున.
తిమ్మాద్రిపాంగీకృతిం గూర్పఁజాలు
కాలంబు గోఱకు నాకాంక్షించుచుండి
ధృతికవాటంబు విదీర్ణంబుగాఁగ
మరునంపకాఁకలన్ మఱుఁగుచునుంటఁ
గానకీబాల నన్ గఠినుఁగానెన్నె;
ఎన్నంగ రాదె నీవిన్నాళ్ళదనుక
విరహతప్తుడఁవయ్యుఁ బ్రేయసీ వదన
లావణ్య రససేవ గావించికొనక
నిలిచినకఱకుమానిసి వౌచునుండ.
"అంతరాంతరముల నన్యోన్యదర్శ
నానంద రసవర్షణాసేచనమునఁ
బనరెక్కి బిగియుచుం బ్రణయపుష్పముల
నాసలన్ వృంతంబు లాకృష్టిసేయు"
అంచుఁ గమ్మని సూక్తు లలరించు కమ్మ

---

౯౧౨ చూడు ౮౦౭. పాదము.
౯౦౪ ఇన్నాళ్ళ—చూ 3౫౪. పా.

నీదుండగముఁ దెల్పెఁగాదె; యింకైన
నాత్మాపరాధ క్షమార్పణ శతము
గావింప కిటులూరకయ చూచెదేల?
అనుకొంచు నతఁడామె కభిముఖుండగుచుఁ
జాటూక్తులను జక్క సవరింపఁ దొడఁగి
యాత్మాననంబున కానందబాష్ప
లహరి సమ్మోద సామ్రాజ్యాభిషేక
మొనరించి దగ్గుత్తికను గెల్వలేక
దాని చూపినదారిఁ దరలించె నుడుల:
క్షమియింపు విశ్వసింపుము చెలీ వీని
గృపనేలు నీకు విక్రీతుఁడౌ వాని;
మనసెఱుంగుచు నీదుకనుసన్న మెలఁగు
దాసుండ యనుకొమ్మ తరళాయతాక్షి;
మఱచినం దనుఁదాను మఱచుఁ గాకితఁడు

---

౯౧౪ క్షమార్పణము-ఇది లోకప్రసిద్ధపు వాడుకలోనున్నది. క్షమా= క్షమింపుమనెడి క్షమావాక్యముల యర్పణమని యర్థము చేయ నగును. లేదా "ఆత్మాపరాధ క్షమాభ్యర్థనంబు" అని పఠింప నగును.

౯౧౯ లరయతి-చూ. ౨౧౧ లఘుటీక.

౯౨౨ మాల్యవతీ ప్రేషిత ప్రణయ లేఖాంశముల కుత్తరముల నిచ్చు చున్నాఁడు.

౯౨౬ చూడు. ౭౦౪ పాదములోని ప్రణయలేఖయందలి విషయము లీప్రసంగమునుబట్టియు నూహింపనగును.

విస్మరించునె నిన్ను వికచాబ్జనయన;
భవదాస్య రాకేందుఁ బాయంగలేక
ననునొంటి దిగనాడి నినుఁ గూడిమాడి
విహరించు మచ్చిత్త విక్రీడితములు
విన్నవింపఁగ రాఁగ విధిసూత్రధారుఁ
డీవింత ప్రహసనంబిటుఁ బ్రదర్శించె;
కార్యసిద్ధులు విఘ్నకార్యంబులంట
నిక్కంబ యౌఁగాదె నీలాభ్రవేణి;
సైఁప నక్కఱలేదు సైఁచినన్నాళ్ళు
ప్రళయకాలానల జ్వాలలందుఁజుక
సాగెఁగాదె తురుష్క శలభ జాలంబు;
విజయలక్ష్మి తనంత విద్యాపురీశు
వరియించె ననుఁగొమ్మ పరువంపుఁగొమ్మ;
రామభూపాల నిర్వ్యాజప్రసాద
సర్వస్వ సర్వంకష ప్రాభవునకు
వీరసింహున కంకఁగా రానిదంచు
నొకఁడుండునే; యింక నువిద వేయేల!

---

౨౭ "చంద్రమా మనసోజాతః" (శ్రుతి).

౩౧ హాస్యాస్పదీ భూతకారా ప్రవేశాదికము.

౩౩ విఘ్నపూర్వకత్వము కార్యసిద్ధులకు స్వాభావికమని భావము. "ప్రాయేణ సత్యపిహితార్థకరే విధౌ హి। శ్రేయాంసి లబ్ధుమసుఖాని వినాంతరాయైః" (భారవి) "కార్యనియత పూర్వవృత్తి కారణమ్" (తర్కసంగ్రహము).

౩౫ చూ ౭౪౭. అన్ని + నాళ్ళు=అన్నాళ్ళు (చూ౩౫౪).

తిమ్మరాజ ప్రసాదితమైన మేలి
మాల్యవతీ పుష్ప మాలికందాల్చి
విద్యాపురోద్యాన వీథీవిహార
మున వీరసింహుండు తనియు నై శంబ;
కొమ్మ యీముద్రఁగ్రై కొమ్మ యందనుక;
నాంతరంగిక సేవ నలరించుఁ జుమ్మ;
దయసేయుమ యనుజ్ఞ తారుణ్యసీమ,
యరి మారణపుదీక్ష నెఱ వేర్చుకొఱకు.
ఆవచనాసవం బాని యామగుద
స ననన్నతరలు లజ్జాసఖింబాసి
యొడ లెఱుంగని తమి నంగ్రంబుగ్రవేలఁ
గంపిత స్విన్నాంగకంబుగాఁ దొడిగి
గద్గదావిల గళతక్రంఠ స్వరమున
నవ్యక్త మధురాక్ష రాలాపములను
బలికింపఁగా సాగె వదన యంత్రమున:

---

౯౪౪ గ్రంథము పుష్పగుచ్ఛగ్రథితమంజరియగుట సుసంగతమగుచున్నది.

౯౪౭ ఇందలి మగఱాలరవల నె త్రాగినాయిక మరణించును. (౧౦౭౩-౧౦౭౪-౧౦౭౫పాదములు) కావున నంతిమ భూతమరణ రంగమున వలసిన సేవచే నలరించునని యాంతరార్థము నెన్నునది.

౯౫౫ } ౧౦౭౩-౧౦౭౫ పాదములచొప్పున నియ్యది యాత్మహత్యా
౯౫౬ } . సాధనమగుఁగాన స్వేదకంపము లొదవెనని యాంతరార్థము.
ప్రియత మాంగుళీయక స్పర్శవశమున సాత్త్వికోదయమయ్యెనని బాహ్యార్థము.

మదన మనోజ్ఞాంగ, సదయాంతరంగ,
నాదు నోములపంట, నను నోముదంట,
నీయనురాగంబు నీదయాగరిమఁ
గనలేక మఱచి నన్, జననుంటివంచు
శ్యామా సహజమైన చాపల్యమునను
సంతరించిన కమ్మ జల్పితంబులకు
సైరింపుమా కాంత గారాము పేర్మి;
నాచాపల మెఱింగి ననుసంతరింపఁ
జనుదెంచు నిన్నొంచెఁ గనుకట్టునియతి;
యని నానఁగుందుచు నడలునం బడలు
నట్టి నేనేడ! నీకగుఁ గాదటంచుఁ
గర్తవ్యమును దెల్పెఁగాఁ జూచు టేడ!;
ప్రణయంబె కీడెంచు రారానిదనక
యనునట్లు నాచిత్త మారాటమంది
పెర రేఁప నీరీతి విన్నవించుటకు
సాహసించెద సైఁపు జగదేకవీర.
శూరాగ్రసరులైన భారతీయులకుఁ
బిఱికి పందలు మల్కుమొఱకు తేండ్లకును
సాటియే! హా స్త్రిమశక తారతమ్య

---

౯౭౪ చూ ౯౨౭, ౯౩౨ పాదములు.

మనఁదగుం; గలియుగార్జునుఁడవో నీకుఁ
గదన రంగంబనం గల్యాణవేది;
అది నేనెఱింగియు నలుకొందుచుండుఁ;
గదనంపు ఫలసిద్ధి కాక తాళీయ
మని కాదె నీతిజ్ఞు లని దూఱుచుంద్రుఁ;
మనసు నిల్వక యిట్లు మనవి సేయంగ
వెఱవనైతిని గాక విరహార్తి కులికి;
సహజభీరూక్తులు సాహసాంకులకు
మదికెక్క నేర్చునే మఱుమాటలేల?
ఇంతకు నినుఁద్రిప్ప నేనెంతదాన;
నఖిలంబునకు నీవ యగు దంటలెన్న.
అంచుఁ బ్రస్తావించి యంతసాశంక
ముగనామె విరమింప, మునుపల్కుటలకె
వెఱచియుంబోలె వాతెఱ సంచలించి
వేవిధంబుల విన్నవింప నుంకించు
తన తత్తరంబెల్లఁ దలఁపింపనయ్యె.
ఆమాట నేగుపు నయ్యనురక్తి
యావిరహాసహాస్వాంత మావినయ
ఒకవంక నొడియంగ నుత్సాహశక్తి
యొకవంక దిగువంగ నూటాడెనాతఁ
డంటుటాల్ దివియు లోహ శలాకవోలె

♦ ♦ ♦ ♦

---

౯౪౧ భావ్యనర్థ ప్రేరిత వాక్ప్రణాళి.

# వీరసింహుఁడు.

## చతుర్థగుచ్ఛము—ప్రథమపుష్పము.

క్షణభంగురంబులు సంగ సౌఖ్యంబు
లనుటకు దృష్టాంతమగుచు భాస్కరుఁడు
పద్మిని నామోద భావితంజేసి,
యంతఁ గాలవశాన నస్తాచలాభి
ముఖుఁడయి చన నరిమోదసంధాయి
నతని సంభావించినందుకై యలిగి

---

౯౯౯ వీరసింహుఁడు మాల్యవతిని సంతోషపెట్టి తానస్తమించు యుద్ధభూమికేఁగఁగా శత్రువగు వీరసింహుని వలచి చెఱనుండి మాయచే విడిపించినందుల కలిగి తురకరాజు తన్నుఁ జెఱనుంచి, యవమానించుటకుఁజేసిన హుకుము విని నాయక సమావేశము జన్మాంతరము లందగుఁగాక యని తలంచి మాల్యవతి మగజాల రవలఁద్రావి (౯౮౭-౧౦౭౩) మరణించెనను నేతద్గుచ్ఛ కథావస్తువు సూర్యాస్తమయ వర్ణనవ్యాజమున ధ్వనితముగావింపఁబడుచున్నది. యవనులు మన్నించుకువలయేశుండు=తురుష్కులు పూజించు చంద్రుఁడు. "క॥ గోవధము చేయు తురకల। దైవంబవు...... నీరజవైరీ॥" (మను. 3 అ ౪౨).

౧౦౦౪ అందుకు, ఇందుకు, ఎందుకు, మహాకవిసమ్మతములు ,,ఇందుకును దృగ్జాలంబు రాఁజెల్లునే" (వసు చ. 3ఆ ౧౨౪), అందుల కలిగి" అని పఠించినను బఠింపనగును.

యవనులు మన్నించు కువలయేశుండు
తన్నొంచి భంగింపఁ దార్కొనునంచు,
నాపద్మినీ సాధ్వి యాత్మేశుసంగ
ముద యాంతరములందుఁ బొదలుఁ గాకంచుఁ
బ్రాలేయ బిందుల న్వజ్రంపుఁ బొడులఁ
గ్రోలిదళంపుఁ జక్షుల మూసియొరగె.
వీరసింహుని చెఱ విడిపించు మోస
మున కల్గి తనుఁగార నుపగూఢముగ
నంపిన సులతాను నాజ్ఞప్తి యలఁతి
దినములలోన బందీగృహాధీశ
జనకాప్త సఖునుండి మునుమున్న యెఱిఁగి,
యమూల్యవతి గూరి సామ్మలం దేఱి,
చింతాజడంబౌచు నంతరంగంబు
కరణ ప్రణాళీ ప్రసరణంబులేక
నిర్నిద్రమయ్యుఁ దానిద్రించుచుండ,
నవనీత సంకాశమవు మానసంబు
శోకాగ్ని సంతప్తమై కాఁగిపొంగి
పొరలి, కన్ గోనలం దొరఁగెనోయనఁగ

౧౦౧౨ తండ్రియగు తిమ్మరాజునకేని తెలియనట్లనిభావము. ౧౫౮-పాదము.

౧౦౧౮ కరణ=ఇంద్రియ.

౧౦౨౧ సంయుతా సంయుత ప్రాసము. చూ. ౬౦౪ పాదము.

వేండ్రపుఁ గన్నీటి వెల్లువల్ పాఱఁ,
గఱకు సుల్తానిచ్చు కఠినంపుటాన
వెఱచఱపునఁ జేసి వ్రీలిగుండియలు
విటతటమ్ముగఁ దూలి తటతటల్ గొనఁగఁ,
గ్రస్తేందురీతిఁ బర్యస్తాలకముల
నడఁగి దీనాతి దీనాననంబొదుగఁ,
జింతా బహుళభంగి క్షీణించువదన
చంద్రు దుఃస్థితిఁగాంచి సైరింపలేక
సాజంపు స్వైరంబు చాలించిహస్త
బిసరుహం బవలంబ మొసఁగనో యనఁగ
నరచేయి చెక్కిటి నత్తియుండంగ,
నాకారమందిన శోకదేవతయొ
నాఁగ నొత్తిలి శయ్యపైఁ గూరుచుండి,
స్తబ్ధమై యొక కొంతతడవుండి, యంత
నిశ్చిత స్వాంతమై నెవ్వగం ద్రోసి,
నిజచేతమును నిట్లు నిరసింపసాగె:
"ఏలచింత వివేకమింతేనిలేక?
చిత్తమా తత్తరించెదవేల చేల?
అసువులం జవిఁ జూపి మసలించెదేల?
అర్కవంశోద్భవుం డభిమానధనుఁడు
నిష్కళంక సుధాంశు నికాశకీర్తి
విభ్రాజితుఁడు తిమ్మవీరాగ్రగణ్యు

నాత్మజ చెఱ కేఁగు నంతటి యసదె;
ప్రాణంబు మి త్తికి బలిసేసి మాన
మును గాచికొనకింక వెనుదీసెదేల?
హా! తాత! నిన్ను దుఃఖాబ్ధిలో ముంచి
యలనాఁడె దివి కేగె నర్ధాంగలక్ష్మి;
ఏకపుత్త్రికనోట నెంతో పేరాసఁ
దల్లిలేని కొఱంత దాలంగనీక
కడగండ్ల కోర్చి నన్ గారాబుతోడఁ
బెంచితి; నాతండ్రి, పెద్దచేసితివి;
అట్టి నీకీఱాఁగ యనుకూలశత్రు
వగుచు నీగతి వగంబాగులంగఁజేసి
తలఁగుచునుండెఁగా తనదారిపట్టి
పరికింప నిందు నానెరసేది? దైవ
దుర్విపాకంబిట్లు త్రుంగించెఁగాక;
వింతలౌ వంతలన్ వేఁగుచునున్న
మజ్జీవితపు మోక నజ్జీవితముగఁ
బచరింప ననురాగ పవమానసీత
జీమూతమైవచ్చి చెఱగహ్వరమునఁ

---

౧౦౪౫ అసమ=నికృష్టురాలు.

౧౦౫౭ తాను జేసిన యపరాధ మవర్జనీయమగుటచేఁ జేయఁబడెనని నిరూపించుచున్నది.

బడరాని కడగండ్లఁ బడుచు జీర్ణించు
హృదయాధినాథు నుపేక్షింతునెట్లు?
భాగ్యంబునం జేసి ప్రాణేశ్వరుండు
తురక వివేకించి తొలఁగించె నంచు,
బందీ విమోచనమందు నాచేయు
జతనం బెఱుంగక నడికి వంచనకు
సంకోచ మందక సాహసం బంచు,
నానిమిత్తంబునన్ శంకించికొంచు,
నరుల దేశంబందె యాలసింపకయ
యాయోధ నోత్సాహియై నన్ను మనిచి
శ్రీరామరక్ష సుస్థితి నందఁగల్గె.
ఆత్మేశ సంరక్షణార్థమై తనువు
వ్యయమౌచు ధన్యంబయాను వేయేల.

---

౧౦౬-౩ చూ. ౧-౨౭-౧౩-౨ పాదములు.

౧౦౬-౭ మాల్యవతి తనకై చేసిన సాహసమున నామెకెట్టికీడు మూఁడునోయని శంకించికొనకయె వీరసింహుఁ డేఁగుటయజ్ఞానకృతమగుటచేఁ బ్రణయభంగము లేదని భావము.

౧౦౨౩ రామరాయలదరికిఁ బోయెననియర్థము. నిరుపద్రవస్థితి నందెనని యాంతరార్థము. ౪౬౧ లఘుటీక చూచునది.

౧౦౨౪ నాయికామృత నాయక ప్రణయ మూలకమై యగుటచేత రసౌచిత్యభంగము లేదు.

దైవంబ! యీపట్ల దయఁ జూపితయ్య!
విపరీతములుచేసి వెతఁ గూల్పకుండ.
ప్రాణేశు వంచించి యసువులన్ వీడు
కొననౌనె యని నీకుఁ గొంకేలమనస?
౧౦౮౦ మానరక్షార్థమై ప్రాణంబు తృణము
గాఁ జూచు వారలం గాదె మన్నించు
శూరాగ్రసరుఁడైన వీరసింహుండు.
అని యంగుళీయాంకితాత్మేశనామ
మధురాక్షరములైన మగఱాలరవల

---

౧౦౭౬ మాల్యవతి యిట్లుచేయనిచో నితోధి కోపప్లవమగు వీరసింహ చిత్రవధ మర్వారమె (౪-౨౪ పాద) యగుటచేత నీపట్ల విధి దయనె చూపెనని మాల్యవతి ప్రణయాతిశయోచితముగఁ బలుకుచున్నది. ఇచటి దైవశబ్ద మదృష్ట పరమెయననగును. అద్దానిపైఁ ౹ గూరదేవతాత్వ మధ్యవసింపఁ బడుటచేఁ దయనూపితయ్య' అనువాక్యము సమర్థమగుచున్నది. ఇట్టిగాణోక్తిచే నిందు సమాధిగుణమును వెలయుచున్నది. దైవశబ్దమును గవులు దేవతాపరముగనువాడియున్నారు. క॥ ఏలినవానిని దైవము౹ నాలిని బంధులను సముచితారాధనసం౹ శీలతఁ బ్రీతులఁజేయని౹ పాలసుఁడు...(ఉద్యోగ ౨ ఆ) "ఇతండే దైవంబని కల్పకప్రసవ వృష్టింబూజగావించి రింద్రాదుల్...(హరిశ్చంద్రనలో ౧ ఆ ౨౨ ప).

౧౦౭౮ } నాయికామరణావశ్యకతయునట్లు కౌనినాఁటి యనర్థమును విశ
౧౦౮౧ } దీకరింపఁబడుచున్నవి. ౧౧౦౨-౧౧౦౩ పాదములలో నీవిషయ మింక బాగుగ విశదీకరింపఁబడెను.

౧౦౮౩ }
౧౦౮౫ } చూ ౯౪౮-౯౪౯.

నమృత బిందులఁబోలె నాని యాతన్వి,
యాత్మాపరాధ సమాధానలేఖ
చెలుల మూలంబునం జేరు నీశునకు
నంచు నీరీతి లిఖించఁగా సాగెః—
"జన్మ జన్మములందు స్వాంతంబు నిన్నె
సేవించుఁ గావుతఁ జిత్తేశ్వరుండ;
కాంత నీయవ్యాజకారుణ్య మెప్పు
డీతపస్వినికిఁ జేయూఁత యౌఁగాత.
కొఱనోము నోము నీ నిఱుపేదతనువు
జనికర్తృ పరతంత్రతను గృతార్థతను
మెలఁగకున్నను సమాధులయందు నిన్ను
భావించి తనివోవ సేవించి నీదు
కల్యాణ గుణములం గాంక్షతో నెన్ని
కఱవు తీఱఁగ నీదు కారుణ్యగరిమ
మన్ననల్ గాంచియు మదిధన్యమయ్యె;
ఈమాత్ర కోర్వలేకిటు మచ్చరించి
కనుల నిప్పులు పోసికొనె దుష్టనియతి.

---

.౧౦౮౮ ముత్పరక సత్వము పాక్షికమగుట మహాకవిసమ్మతము. (చూ. ప్రౌఢ-క్రియా ౧౬సూ).

.౧౦౯౩ ఖండాఖండప్రాసము మహాకవిసమ్మతము.

.౧౦౯౫ చూడు ౧౫౩. పా.

స్వాభీష్ట సంసిద్ధి భంగంబు నరసి
పరిభవా పరిశుద్ధి పడయుంగ వెఱచి
స్వాతంత్ర్యమును జూపవలసె నీమేన;
నపరాధములు సైఁపుమా ప్రాణనాథ......"

---

౧౧౦౨-౧౧౦౩ "వీరసింహుని జెఱనుండి విడిపింపకున్న నితోధికోపద్రవమగు ప్రాణనాశ చిత్రవధ సంభవించి స్వాభీష్ట సంసిద్ధి యెట్లును గలుగనేరదు. ఇంక దాను మరణింపకున్న సు సులతాను హుకుము చొప్పున సహింపరాని యాత్మపరిభవమును స్వాభీష్ట సంసిద్ధిభంగమును దుర్వారములెయగును" అని మాల్యవతియరసి యాత్మహత్య చేసికొనెననిభావము.

# వీరసింహుఁడు.

## చతుర్థగుచ్ఛము—ద్వితీయపుష్పము.

తన కులంబునవారు తనుఁ గొల్చువార
లొండొరుఁ గలహించుచుండఁ జంద్రుండు
సైపకుండుటఁ బోలె క్షైణ్యంబునొందె.
శీతాఁశు కేతుల జీర్ణింపఁ జేయు
౧౧౧౦ లోకబాంధవు మీఁద రోషించి యట్టి
కేతుసమూహ మేకీభావ మంది
దాడిచేసె ననంగ దశదిశల్ మంచు
వ్యాపింప గడగడ వడఁకె లోకంబు.

---

౧౧౦౬ సదాశివదేవరాయలు నళియ రామరాయలును వీరసింహుఁడును జంద్రవంశ్యులనియుఁ దురుష్కుల యిష్టదైవము చంద్రుఁడని యుఁదాత్పర్యము. "గో వధము సేయు తురకల। దైవంబవు... నీరజవైరీ॥" (మను. 3 ఆ ౪౨ ప).

౧౧౦౯ కేతుల=(తురుష్కుల) ధ్వజముల, కిరణముల.

౧౧౧౦ లోకబాంధవుమీఁద=రామరాయల మీఁద, సూర్యునిమీఁద ననియును జెప్పనది. ఇందు. లరయుకి:-చూ-౭౧౧ పా. లఘుటీక.

౧౧౧౧ అట్టికేతుసమూహము=హిమరశ్ముల సమూహము; అనఁగాఁ జంద్రకిరణసమూహము. (తురుష్కుల) జెండాలసముదాయమును; అనఁగాఁ దురకలసేనలు.

౧౧౧౩ చలిచేత వడఁకెననియు, లోకబాంధవు మీఁదికి దాడిరాఁగా లోకము వడఁకెననియు చెప్పనగును.

సులతాను లత్తఱి నలువురుం గలసి,
నిజమహాసైన్యవార్ధిధులతో మొనసి,
విద్యాపురికి దాడివెడలుచుం దఱిసి
తల్లికోట సమీప తలమునం గృష్ణ,
నర్మ్మహానది దాఁటననువైన రేవు
లరసి రా వేగులనంచి, యద్దరిని
విడిసి, రాయలనొంచు వెరవు లారయుచు
గొలఁదికాలము వేచుకొని యుండునంత
ఖడ్గంబునకు మంత్ర కార్యంబునకును
విభున కాప్తుండైన వీరసింహుండు
బీజాపురమునుండి వెడలి ప్రచ్ఛన్నుఁ
డై వచ్చి యచటి రహస్యంబు లెఱిఁగి
కనలె నీగతి: "నాదఖరభానుపైని
దాడి చెసెడునట్టె! తమము రేకెత్తి;
ఎంత దిట్టరు లైరలంతి తురుష్క
లేమి విపర్యయం బెంత యబ్బురము!
కాలమాహాత్మ్యంబుఁ గననాసె యకట!
భారత సామ్రాజ్య భారధూర్వహుఁడు

---

౧౧౨౮ చూ. ౯౫౨ పాదము.

౧౧౩౧ "మ॥...ని। ర్దళితారాతులఃభూరిభూభరమహాధౌరేయకుల్..."
(ఆది-౬-౫-౧౬౭౪). అనునన్నయ్యభట్ట ప్రయోగముచొప్పున
నింపుఁ బునరుక్తిలేను. భారశబ్దము ప్రాచుర్యార్థకము.

రాజదేవేంద్రుండు రామరాయలకు
వెఱచి కాలికి బుద్ధిఁ గఱపుటెల్ల
మఱచిరే కాదె యీమొఱకుఁగట్టిఁడులు;
మఱతురుగాకింత మాత్ర నేమాయె
పఱతురుగాక యెప్పటియట్ల మరలఁ,
దమకోరుచున్న యంతర్వేదిఁ గాన
కయమున్న, కృష్ణాపగాదక్షిణంపు
దరిఁజేరకయమున్న, తమదారి పట్టి.
తడవు చేయకయె విద్యాపురిం జేరి
రాయల యాజ్ఞప్తి ప్రాపించి యిటకుఁ
జతురంగబలముతోఁ జనుదెంచి కృష్ణ
వలచక్కి నరికట్టవలయు వేవేగ.
జాగుచేసిన నింక నోగు వాటిల్లు:
అల కృష్ణదేవరాయల విస్మరించి
ప్రజలు జేజేవెట్ట రామరాజ్యముగ
ధన్యుండు శ్రీరామధరణీశ్వరుండు
తన్మోతలంబేల నేకచ్ఛత్రముగను,
నిరుప ప్లవంబాచు నిరతంబు గళల
వాణిజ్య శతముల వ్యవసాయములను
నెగడుచు నుండుట న్నిత్యకల్యాణ
మును బచ్చతోరణంబునునైన విజయ
నగర సామ్రాజ్యంబునకు సాంపరాయ
కోపప్లవార్భటుల్ చూపంగ నౌనె?

క్రూరరాక్షసులకుఁ గోసియుంబోలెఁ
గాఁణాచి స్వర్గలోకము వీడి దేవ
తములు సాహస్రంబులములందు విడిసి
నిరుపద్రవంబుగా మురియు ముక్కోటి
దేవతల్లాఁపున్న పావిత్ర్యపదము
నకట! దేవద్విజాంతకులచే ఘోర
గోఘాత కరపాతకులచేత మిగుల
నపవిత్ర పఱుపనీయఁగసాగె నేఁడు.



ప్రాలేయ సాంద్రవర్షముల రెట్టిల్లి
సూచికాభేద్యమై చూడ్కుల న్మాపి
కటికి చీకఁటి వెల్లి కప్పి లోకంబు
జ్ఞప్తిఁ దేరఁగసాగెఁ గాళరాత్రులను.
హిమవృష్టి నత్యంత హిమితమైయుంట
దరిఁజేరు తనువు కొంకరలు వోవంగఁ
బాఁపతేఁడులను ద్రెంపఁగఁ జాలువడిని
గంభీరిమం బాఱఁగా సాగి కృష్ణ

౧౧౫౫ } రాక్షసుల బాధ కోర్వలేకుండుటచేతను వలెనె దేవతలెల్ల విజయ
౧౧౬౩ } నగర దేవాలయములం దవతరించి యున్నారనియు నట్టివారికి
రాక్షసులవంటి క్రూరులగు తురకల సంపర్కము కలుగనీయ
రాదనియుభావము.

౧౧౬౬ విశేషవళి (అప్పక. 3 ఆ. ౫౬ ప.) "జ్ఞానికినుపదేశవిధిఁ
బ్రకాశము సేయన్, (శాంతిపర్వము౪ఆ౫౫).

యలతురుష్కుల దాడి కర్గళం బగుచుఁ
బెట్టని కోటయ్యెఁ బెఱసైన్యములకు.
కల్పాంతవేళ లోకములు ముంపంగ
దక్షిణోదజ్మహోదధులై యుప్పొంగి
ధరణి ముంచుచు వచ్చి తఱిసెనోయనఁగ
హిందూ తురుష్క వాహినులు దక్కృష్ణ
కిర్వంకఁ గప్పుచుం బర్వంగసాగె.
అఱిముఱిఁ దురకసైన్యము లట్టియెడల
హిందూల కనుగప్పి కృష్ణదక్షిణపుఁ
౧౧౮౦ దీరంబుఁ జేరంగఁ దారు చద్దరిని
రేవు రేవులయందుఁ గ్రోవులై యున్న
భారత చతురంగ బలము వ్యూహముల
నాయితంబై యున్న యగ్నియంత్రముల
వీక్షించి నదిదాఁటు పెగవేది, యంధ
తమస రాత్రులు మాఁటిఁ దఱియించు కతన,
తుదిరేయి తెంపున నదిడిగ్గి శత్రు
సైన్యాబ్ధి బాడబజ్వల నాయమాన
దహనాస్త్రకోటి దంద్రహ్యమానంబు
లై త్రెళ్ళ; హైందవులడరి యుద్ధాన
౧౧౯౦ సింహనాదంబులం జెలరేఁగి యచటి
కృష్ణాప్రవాహంబుఁ గీర్తించిరిట్లు:
"శత్రుసేనాంగాంగ జాతరక్తౌఘ

---

౧౧౭౯ చూ. ౪౯౮. పా.

పూర్ణమై త్రెళ్ళెడు ముసలిమాన్ కూటు
వులఁగూడి శ్మశ్రుకుంతల కీర్ణమస్త
కంబు లన్ జీర్ణగుల్మంబుల న్నిండి
గజవాజి ముఖమృత గాత్రనక్రాది
యాదో భయంకరంబౌచుఁ దొల్కాఱు
వరద నా శోణమై ప్రవహించుఁ గృష్ణ."
అంచు నుష్పాంగుచున్నంతలో హైంద
వీయసేనలొకింత విరళతంగాంచు
నొకక్రేవఁ గనుపెట్టి యొక్కుమ్మడిగను
గంభీరవేదఃలౌ కుంభి యూథముల
తో నమ్మ్రారావులుఁ దోడ్తోన సైన్య
ములు కృష్ణవలతీరమును జొచ్చి పర్వె.
అవ్విధి ప్రాతికూల్యంబునం జేసి
హైందవ హృద్భూము లద్రువంగసాగె.
ఎఱతిమ్మ వేంకటాద్రీశాదియోధ
ధీరతాకుల గిరుల్ దిర్దిరం దిరిగె;
ఆననేందుఁడు కళాహీనుండు కాఁగఁ,
జేయి విదిర్చుచుం, జెడెఁ గర్జమంచుఁ,
బ్రతికూలవిధి చెద్ది మతి దూఱికొంచుఁ,

---

౧౨౦౫. భావ్యనర్థ సూచక భూకంపాదులు చిత్తవిభ్రమాదులు వర్ణితము లగుచున్నవి.

౧౨౦౬ అప్రమ-ఇందలి,అ' లఘువు. శిథిలద్విత్వము. బాల-ప్రకీర్ణ-౨౦సూ.

దిరిగె శకంబంచు, ధీరతం డించి
వీరసింహుం డిట్లు వెతఁగూరి పొగిలె:
"భారత యోధాగ్రణీ రతుఁనున్న
కృష్ణ నుత్తరియించె రిపుసైన్య మడరి,
వేంకటాద్రీశుండు వీరసింహుండు
నెఱతిమ్మ భూపుఁడు నెదిరియుండంగ;
ఏల! వికత్థనం బేల! యార్భటులు!......
విధి ప్రతికూలుఁడై వికటించెఁగాక,
పిఱికిపందలు మల్కు మొఱకు లీరీతి
నెన్నఁడే నెదిరించి కృతకృత్యులైరె;
శరణు సొచ్చిరటంచు గరువించి రామ
రాయఁడు కరుణించి దాయలం బెంపఁ
గాఁ గాదె తురక లక్కటా! యైక్యమంది
రేకెత్తి హైందవోద్రేకం బడంప
వెఱవేది తలపడి విక్రాంతి మనిరి;
శత్రుశేషము హుతాశనశేష మనఁగ
నెన్నఁడేఁ రవులు శోకున్న వేయేల!

---

౧౧౫ ఉత్తరియించె. "నప్రాద్యవ్యయ సంబంధ! స్తన్నిషేధే ప్రయోజకః" (అధర్వణకారిక). అనుకారికచొప్పున నపూర్వక్రియకును (సమస్తక్రియకును) నిత్యమువచ్చుట సాధువగుచున్నది.

౧౨౭ "అగ్నిశ్శేషం ఋణాచ్ఛేషం। శత్రోశ్శేషంన శేషయేత్."

౧౨౮ ,,వీను బ్రాఁకింపఁగఁ గైకోక యిట్టివాని[illegible]

గర్వప్రమత్తతా ఘూర్వహుం డగుచు
శ్రీరామరాయందు చెదరఁడింతేని....
అనియిట్లు వగఁగూరి యతఁ డంతఁ దేఁటఁ
గా సాగి యీరీతిగా నెన్నఁదొడఁగె:
"ఎంతవింతీమాత్ర కే వీరసింహ
ధీరతా కవచంబు దీర్ణంబయయ్యె;
అకట! మాల్యవతి కేమయ్యెనో! యింత
మాత్ర కే చెదరునా? మన్మానసంబు....
చాలు నసంభావ్య సంభావనములఁ!
గల్యాణముసె విధి ఘటియించుఁగాక;
శాంతించెఁ బాపంబు! చనె నమంగళము!
లవమాత్ర చింతానుభవమునం దీన,
వికటించుఁ గా కేమి విధిహతకుండు
సాహసాంకుల పౌరుషమునకు నెదురె;
చెదరఁడు గా కేమి శ్రీరామరాయ
భూమీశుఁ డీమాత్రఁ బొగులంగనౌనె?...
తలఁప సమ్మోదించు తఱి తారసిల్ల
వగఁగూరితిని రిక్త ప్రతికూలమంచు
ననుకూలదైవంబు నాడిపోసితిని;

---

౧౨౩౫ ఈసమయముననె యచట మాల్యవతీ హత్య జరిగెనని భావము.
౧౨౩౮ „శాంతం పాపమ్-ప్రతిహతమమంగళమ్" అమంగళ వాక్య నిరాకరణ సందర్భమున వాడఁబడెడి నాటకాదిప్రసిద్ధోక్తి.
౧౨౪౪ ఆడిపోయు=మిక్కిలిగ నిందించు.

వెనుదీసి వెనుదీసి విధివశంవదత
స్వవినాశ కాలంబు సమకూరుకతన
౧౨౫ తురక లంతర్వేదిఁ జొరఁబాఱిరౌర!
క్రిమికోశమధ్యగ క్రిము లట్లు లింక
మనకు సగ్గంబైరి; మఱుమాటలేల!
నలువు రొక్కమ్మడి న్నశియింతు రిగాక!
ఆంధ్రులు చోళ కర్నాటులుం బాండ్య
లల చేర కుంతలు లారణ్యు లనఁగ
దశ లక్ష సంఖ్యాక దళముతో నున్న
హైందవ సామ్రాజ్య మాగర్భశత్రు
తురక రాజ్యమునింకఁ దుదిముట్టఁజేసి
శాశ్వతంపు జయధ్వజం బెత్తుఁగాక!”

◆ ◆ ◆ ◆

---

౧౨౫ అంతర్వేది=కృష్ణాతుంగభద్రల నడిమిరాష్ట్రము. (వసువిమా-
౧౮౧ పుట).

# వీరసింహుఁడు.

పంచమగుచ్ఛము—ప్రథమపుష్పము,

౧౨౬౧ ఆత్మేష్ట దేవుని నడఁగించి యడరి
యుత్తరాశాక్రాంతి నొత్తుటం గనలి
రక్తాక్షి రూక్షోమ్మరావు లుగ్రమున
నిను మస్తకము ద్రుంచి యెత్తిరోయనఁగ,
రక్తాంశువుల్ గ్రక్కు-రవిమండలంబు
కువలయం బులుక శత్రుని దెసం దోఁచె.
తల్లి కోటాంతిక స్థలమునందుండు
కృష్ణాతరంగిణీ కీనాశతటిని
గ్రుద్ధులౌ హిందూతురుష్క- లొండొరులఁ
దాఁకిరి యద్దేవదానవులట్లు.

---

౧౨౬౨ రక్తాక్షి రూక్షోమ్మరావులు=క్రోధారుణిత నేత్రులగు రూక్షు లగు, ఉమ్మరావు లనఁగా తురుష్క- వీరాగ్రణులు. ఉమ్మ రావు శబ్దమన్యదేశ్యము- సంజ్ఞావాచిగాన సిద్ధసమాసమధ్యగతి మష్టము కాదు. "గ్రామమానుష్యబిరుద శబ్దానామపిసోమతః... సోమత ఇతి సంస్కృతమధ్యేసమాస ఇష్ట ఇత్యర్థః....,నానా వజీర సేనామాన భేదనుండు." (అహో ౭౧౨ పుట).

చండరౌద్రావేశ చలితంబులౌచు
నరగజాశ్వపతి సేనలు మూఁడు తెగలు
భామినీ రాట్చమూ భాగముల్ నాల్గుఁ
దుములంబుగాఁ దాఁకు సమరాంగణంబు
ఝంఝాప్రభంజనోచ్చలితంబు లౌచు
నేడు సముద్రంబు లేకమౌతఱిని
గలుగు సంక్షోభంబు తలఁపింపసాగె:
క్రోధారుణిత వక్త్ర యోధప్రయుక్త
ముద్గర దహనాస్త్ర ముసలాసి కుంత
పట్టిస తోమర పరశుత్రిశూల
పరిఘ క్రకచ భిండిపాల చక్రాది

---

౧౨౬౦–౧౨౬౯ } తమయిష్టదైవంబగు చంద్రునవఁగించువాఁడయి యుత్తరాయణగతుఁడై యునుఁడుండఁగాఁగోపరక్తనయనులయి యుమ్మరావులనఁగాఁ దురుష్కవీరు లానూర్యుని శిరమునుద్రుంచి యెత్తిరనునట్లుగాఁరక్తకాంతులుఁగల రవిమండలము కలువలు ముకుళించుచుండఁగాఁ దూర్పున నుదయించెనని సూర్యోదయ పరార్థము. తమకిష్టుఁడైన తురుష్కప్రభువు నడఁగించి యత్యధిక రాష్ట్రవృద్ధికరణాశాగ్రస్తుఁడై రామరాయఁడుండఁగాఁ గోపించితురుష్కవీరులుఁరక్తాక్షిసంవత్సరమున ననఁగా౧౫౬౫(A.D.జనవరిలో) క్రోధసంవత్సరమున రణభూమిని నారామరాయల శిరస్సునుద్రుంచి శోణితధారాకలితమగు నద్దాని నారామరాయలు యుద్ధముచేయుప్రదేశమున నెత్తుటయు భారతీయులెల్ల నుల్కిపాటుటయు ననెడి భావార్థము వ్యక్తమగుచున్నది.

ఘూర్ణణ ప్రస్ఫుట తక్వచిత్రశీర్ష
ముఖగాత్ర భవ రవంబులు దిశల్ నిండి,
ప్రళయకాలోదిత ద్వాదశాదిత్య
భాను తప్తాజాండ భాండవిస్ఫుటన
జనితస్వనంబున కెన యాచునుండె;
ఆనకశంఖ కాహళ యశఃపటహ
భేరీ మురజతాళవేణు నిస్సాణ
పణవాది నినదద్విగుణిత సంరంభ
దహనాస్త్ర ఘాంఘమధ్వని సముద్రిక్త
సంకుల సంగ్రామ సంక్షోభ చలిత
జంగమ ప్రస్రవాచలధీ ప్రదాయి
శస్త్రక్షతి క్షరత్ క్షతజ ప్రవృద్ధ
మదనిర్ఝ రోద్దామ మత్త మాతంగ
కర్ణకఠోర ఘీంకార నాదములు,
విలయకా లాసారవృష్టి దైకోన
పంచాశదాశుగ వ్యాకీర్యమాణ
పుష్కలావర్త కాంభోద నిర్యాత
నిర్ఘాత సాహస్ర నిభముఁ లౌచుండె;
బధిరిత జనరథ పరిధి ఘోర ఘోష

౧౭౮౬ కౌహలః-పుం....బృహద్ ఢక్కాయామ్... (శబ్దార్థచింతామణికోశము)...... కౌహల-పుం......మహాఢక్కాయామ్ వాద్యభేదే......(శబ్దస్తోమ మహానిధి).

తురగ హేషారవ ఖురఘాతనినద
సంకీర్ణ కోదండ టాంకృతి ధ్వనులు,
ప్రతికూల పవమాన బంభజ్యమాన
భూనభోంతర భాగపూర్ణ పాథోధి
కల్లోలరావ నీకాశంబు లయ్యె.
కృతవీరపాణ దర్పితవీర వార
తీవ్రరౌద్రావేశ దీర్ఘాట్టహాస
గాఢభుజాస్ఫాలకటు సింహనాద
వికటవీరాలాప వికృతస్వనములు,
కల్పాంతకీనాశ కాస రాభీల
కర్ణజ్వరాయిత గరకంధరాట్ట
హాసస్వనంబులన్ హసియించుచుండె.
చాణూరముష్టిక సంకాశమల్ల
భూదారక నియుద్ధ భూదారణోత్థ
గంధర్వశత ఖురాఘాత భూజాత
ధూళీతమస్సృష్ట కాళరాత్రులను,
సకలసేనాంగాంగ సమలంకృతాభ
రణఖచితానంత రత్నఖద్యోత
ములు మిన్కు మిన్కని తులకించుచుండె.
ఇరుబుజమ్ముల మాడ్కి నిర్వంకఁదమ్మ
లెఱతిమ్మ వేంకటాద్రీశ్వరుల్ బలసి

౧౩౧౮ వసు. చరి. ౧౪౭ పుట.

కుతుబుసాఁ ఉదిల్ సాలఁ గుదియించుచుండ,
గుదిమి నడంచి ముప్పదియేండ్లవాని
వడువున రామభూపాలుఁ డుద్దవిడి
నామదానగర నిజాముసా కెదిరి,
యుగవిగమంబునం దిగకంటి వేఁడి
వాఁడి ముమ్మొనవాలు వడిఁ దాఁకి జగము
మడియింపఁగడఁగు నమ్మాడ్కిఁ దోఁపించె.
అగ్నికిం దోడైన యనిలు చందమున
వేంకటాద్రిని గూడి వీరసింహుండు
కల్పాంత కీనాశ కర్కశుండౌచుఁ
గసిమసంగిన మారి కరణినిఁ రేఁగి,
జముఁడు రేఁపిన మిత్తి చందాన నడరి,
కాననం బెరియించు కార్చిచ్చుపగిది
దహియింపసాగె న త్తటిఁ దురుష్కులను.
అంపసంధానంబు జ్యాకర్షణంబు
నిషు మోక్షమును సాగనెడలేక, యేక
నాదమై టాంకృతుల్ నద్దెన ల్నిండ,
విలు కాలచక్రంబువలెఁ గుండలింపఁ,
బుంఖానుపుంఖితంబుగ శరంబులను
వర్షించుచును నుద్దవడి శత్రు తేజ
మార్పుచు వింట విహారంబు సేసెఁ

౧౩-౨౧ చూడు. ౫౦-౬౦-లఘుటీక.

గడువింతయగా ఘనాఘనము నా నతఁడు.
అయ్యెడ భారతీయాభీల శౌర్య
దావాగ్ని వర్ధిత దహనాస్త్రకోటి
దందహ్యమానమై తలఁకి యాకుతుబు
సాహియదిల్ సాహి సైన్యద్వయంబు
వెన్నిచ్చి పఱవంగ వీరసింహుండు,
చెదరి పాఱెడు శత్రుసేనలం గాంచి,
“శ్రీస్వామి కపటు తేజ మాఁగంగలేక
యిదె సహాదులు పాఱె; రదె దుస్సహంపు
టెఱతిమ్మరాట్తేజ మెదిరింపలేక
కుతుబుసా సైన్యముంగూడి బెరీదు
సాసేన పఱవంగసాగె నవ్వలను.
మాంసశోణిత వసామస్తిష్క పంక
మగ్నమై రిపుసేన మసలు చందందుఁ,
బారంగలేక హాహారవంబులను
జేయుచున్నద” టంచుఁ జేయెత్తియార్చి,
“పిఱికిలా తురకల మొఱకు జేండ్లార,
మొఱఁగి మెఱంగి మమ్మెదిరింప నేల;
పూరిఁగఱచియిట్లు పాఱంగ నేల;
చేతికందినయట్టి జేజేలపదవి
చేసేఁ తవిడుచుచుఁ జెనఁటితనానఁ
బాడవాలై పాఱి బ్రతుకంగనాన”.
అనిదూఱు చీరితి నాత్మలోఁ దనిసె:-

“ఔరౌర! పుణ్యుండ వీరసింహుండ
యేమందు! నీకృత కృత్యభావంబు;
రామభూదేవుండు బ్రహ్మయైనడుప,
నెఱతిమ్మ వేంకటాద్రీశ్వరప్రముఖ
వీరాగ్రసరులు ఋత్విజు లౌమనుండఁ,
బళుల సపాదుల న్విశసించి, నీదు
క్రతుదీక్షఁ బూరించి కాంక్షతీఱంగ,
నరి కంఠనిస్సర దస్రాభ్ర వేణి
నవబృథస్నానంబు సవరించి, ప్రేత
భూత బేతాళ జంబుక కంకగృధ్ర
ముఖ్యద్విజాళికి మోదంబుగలుగ
మాంసశోణిత వసామస్తిష్క పూర్ణ
సంతర్పణముచేసి, సహజావమాన
తాపాపనోద సత్ఫలము నొందంగఁ
గల్గె; జన్మము సార్థకంబయ్యె నేఁడ.”
టంచు నుప్పొంగెడి యానందవార్ధి
నోలలాడఁగసాగె నొడలెల్ల మఱచి.

♦ ♦ ♦ ♦

అదె యంతిమానంద మదె యంత్యవిజయ
మదె తృప్తిపరసీమ యయ్యె, నవ్వీర

---

౧౩౬౭ చూడు. ౧౧౦-౧౧౬ పాదములు.

౧౩౭౭ సహజ=భ్రాత. (చూ. ౭౭ పాదము ౧౦౬-౧౧౬ పాద)

సింహునితోడ దక్షిణభారతీయ
వీరసింహులకును; వేయేల! విజయ
చలలక్ష్మి భారత క్షత్త్రదోస్స్తంభ
ములనుండి కుప్పించి మసలిమాన్ రాజ
వక్షోవరోధంబు వాంఛించి దూఁకె.
అటులకాదేని పిన్నటనాఁటనుండి
యుద్ధరంగములందు వ్యూహము ల్పన్ని
చమువుల నడిపింపఁ జతురుఁడై స్వప్న
మునన్నైన నపజయంబును గాననట్టి
రామరాయండు, భారతవీరశూర
తాహుతాశన సమింధన సామిధేని,
హిందూచమూకోటి యెదల కధీర
తానిలంబును సోఁకనీని వింధ్యాద్రి,
తురకసేనానులు వెరవరులగుచుఁ
దనుసేన నడిమిభాగమునందు ఘోర
దహనాస్త్రతతినిల్పి దానిఁగప్పంగ
నల్వంక ధన్వి సేనలనిల్పి పన్ను
మాయిక వ్యూహంపు మర్మంబు నెఱుఁగఁ
జాల కేమఱి తాన సమరాగ్రసీమ
కేఁగునే; మఱలఁ జూఱిచ్చి సైన్యముల
నేమఱించి యరాతిహృతి కగ్గమగునె;

౧౩౯౭ వసు-విమ ౧౪౭ పుట. ౧౪౮ పుట.

ఉప్పొంగు శత్రుసేనోదధిభంగ
వేగంబు నాపెడి వేలాద్రిమాలి
కలనంగఁజాలెను కర్ణాటరాజ్య
లక్ష్మీనివాస స్థలంబులో మత్త
దంతీంద్రములు, భయభ్రాంతంబులగుచుఁ
గలగుండువడి చలాచలములై హస్తి
పకుల నుల్లంఘించి పరసేనవిడిచి
నిజసైన్యములఁ గ్రుమ్మెనే యెన్నఁడేని;
మిను మీఁదఁబడె నన్నఁ దొనఁకింతలేక
విగ్రహంబులయందు వెనుకంజలేక
యశమేని మృత్యువే నందునందనుక
సింగముల్ మత్తమాతంగ కుంభముల
కటికెడుమాదిరిఁ బెలువరూధినుల
పైఁబడి నిజభుజాబలము చూపించు
భారతీయులు తేవిఁ బరులపాల్పేసి
పఱచిరే యెపుడేని ప్రాణాశతోడ;
దురతిక్రమము దైవదుర్జయేప్సితము.
సరసున నిరుగాము పరిపూర్ణమగుచుఁ
బైపయిన్ వాహినుల్ పర్వంగ నడుమ
గండి వింతగఁబడ్డ కరణి నిర్వంక
నాత్మీయసైన్యంబు లరుల నోడించు
నంతట నడిమిసైన్యము లోడి విఱిగి

పఱచుచు హాహారవంబులన్ జేయ,
వెఱఁగున నాలించి వీరసింహుండు
కలఁగాంచి లేచినగతి నుల్కిపడుచు,
౧౪౩౦ మందాక్షు ఖేదసంభ్రమ శీర్యమాణ
మానసుండయ్యు నెమ్మది దిట్టకొల్పి
వేంకటాద్రీశాది వీరాగ్రసరుల
తోఁ గూడి యద్దరి కేఁగుచున్ రిపులఁ
బొరిగొంచు నిటు సేనఁ బురికొల్పసాగె:
తరతరంబుల యశోధనము పోకార్చి
తలఁగంగ నగునె మీక్షత్రముఖ్యులకు!
వీరాగ్రసరులార! విజయాంకులార!
మఱచితిరే నుల్కి మొఱకులకై జంకి
చెండాడు మీతొంటి చెయ్యంబులెల్ల;
౧౪౪౦ మిముఁగని భారతక్షమ వీరమాతృ
తాంకంబుఁ గోల్పోవనగునె యీనాఁడు,
తృణమైనఁ జేయని మృత్యుదేవతకు
వెఱవేల! ప్రకృతిపై మఱవేల యకట!.
పుణ్యవశంబునం బొడసూపుఁగాదె

---

౧౪౩౭ వెనుక రామరాజు వారిని గౌరవించి చేసిన సంబోధనము (౨౪౯ పాదము).

౧౪౪౪ „యదృచ్ఛయాచోపపన్నం। స్వర్గద్వార మపావృతమ్। సుఖినః క్షత్రియాః పార్థ। లభంతే యుద్ధమీదృశమ్" (భగవద్గీత).

తలుపులు తెఱచిన దనుజారిప్రోలు
రణమహీతలము శూరప్రకాండులకు;
తేజంబుఁ జూపెడు ధీరాగ్రసరులు
చచ్చియు స్వర్గంబు సాధింపవచ్చు;
బ్రదికి సామ్రాజ్యంబు పడయుంగవచ్చు.
౧౪౫౦ స్వాతంత్ర్యమునకన్న స్వర్గంబు గలదె;
పారతంత్ర్యముకన్నఁ బాతాళమున్నె;
పులిపందివారడి న్మ్రలఁగి యిందనుకఁ
జేతులొగ్గి గులాములై తురుష్కులను
గొలిచెడు నంత నీచులటె హైందవులు!
మొఱకు తురుష్కుల పిఱికితనంబు
సాంక్రామికపుటార్తి చందాన మీకు
సోఁకెనే! కటకటా! మీకేల వెఱపు,
శ్రీరామరక్షు నక్షీణులోకనుండ ”
అని రేఁపుచును జేనఁగొనినయచ్చోటు
౧౪౬౦ దరిజేర రిపుసేన విరియింపఁదొడఁగి,
చిచ్చుఱపిడుగునాఁ జెచ్చెరం గనిసి,
యభ్యాసపాటవప్రాప్త వేగమున
గడసాదనం ద్రిప్పు కరవాల మొకటె
ముందటఁ వెన్కను గ్రింద మీఁదటను
వలకులం దానయై వైరిశస్త్రములఁ
జొరనీని వజ్రపంజర మౌచుఁ బర్వ

లిడు సుదర్శన కోటు లేకీభవించు
నరివీరమారణ యంత్రమా చుండ,
సాము సేయుచు నసిఁ శత్రుసైన్యముల
వ్యూహంబులను జీల్చుచుండు నయ్యెడల,
"హా! దుర్విధీ! పోయె! నరిచేతఁబడియె!
నిం కేడ! రామభూమీశ్వరుం డకట!
వేంకటాద్రీశ్వరా! వీరసింహుండ!
యెఱతిమ్మభూపాల! యెటనుంటిరయ్య!"
అంచు సైన్యములు హాహారవంబులను
జేయంగవిని వీరసింహుఁ డుల్కిపడి
కనుగుండముల నగ్నికణములు రాలఁ
గంపోత్తరాంగుఁడై కలగుండు వడుచుఁ
దనపుఁ దానెఱుఁగని తమకంబుతోడ
నఱిమిఱి రిపుల వ్యూహములందుఁ జొచ్చి
విలయ కాలములందు వీతెంచునల్ల
సురగాలి రేఁగు చిచ్చుఱకంటి కంటి
మంటనా జాజ్వల్యమానుఁడై యేచి,
సురియతో నెదసించి శిరము వ్రచ్చియును,
గంఠంబు తెగనేసి, కరము ద్రుంచియును,
వలకేల నొక్కని వలకాల నొకని.
డాకేల నొక్కని డాకాల నొకని
నదిమియుఁ జదిపియుఁ, గుదిచి, కూల్చియును,

జగజెట్టి యరకాలఁ జలిచీమపిండు
చదివిన మాడ్కిని మదపు టేనుంగు
గమలాకరంబును గలఁచు కైవడిని,
సింగంబు లేళ్ళను జెనకు చందమున,
నాలమండల వ్యాఘ్రము మలఁచు తోయమునఁ,
జెఱసేన పీనుంగు పెంట గావించి,
యే త్తెఱఁ జూపించు నెడ నెట్టయెదుటఁ
గర్ణాటసామ్రాజ్య కల్పకోద్యాన
దాహక నిర్ధూమధామ దావాగ్ని,
దక్షిణహైందవస్థాన యోధాగ్ర
ణీ ధైర్యఘన రోహిణీ కుజగ్రహము,
ద్రవిడత్రిలింగకర్ణాటాది దేశ
సంపద్వినాశనతును ధూమకేతు,
వహిత నికృత్తరక్తౌఘాతిభయకృ
దుద్ధృత రామరాజోత్తమాంగ మను
విద్వేషిహుస్సేను విజయధ్వజంబు
తోఁచె నాతండు తోడ్తోడ హా! యంచుఁ
బలవించు చుర్విపైఁ బడిసొమ్మసిల్లె.
అడఁగించియడఁగించి యంధకారముల

౧౪౮౯ ,,స్వాతీషై త్రేంద్రశాక్రాహి। ప్రాజాపత్యో (రోహిణీ) త్తరా
సుచ। సంచరన్ జలదాన్ హంతి। భౌమ స్సంవర్తకానపి''
(వర్షయోగసౌవర్ణిక).

దినమెల్ల దీపించి దివసాంత వేళ
నర్కుఁ డస్తాద్రి గుహాంతర ధ్వాంత
కబళితుం డౌ మాద్రిగాఁ దురుష్కులను
గారించి కాగించి గజవిప్లవాభి
ధా కాలమృత్యు సమావేశవశత
రామరాయండు కర్ణాటసామ్రాజ్య
సర్వస్వ మభియాతి సాత్కృతుండగుడు,
నొడలెఱుంగనియట్టి తడఁబాటుతోడ
హైందవ క్షత్త్రియశూరాగ్రణుల్ విజయ
దేవతావేశ దేదీప్యమానోగ్ర
శత్రు తేజోగ్నికి శలభంబులగుచు
మడియఁ, గర్ణాట సామ్రాజ్యంపులక్ష్మి
చాంచల్య మద్దాని చమువులందులను
సంక్రమించెనో నాఁగఁ జలితంబులగుచు
భారతసైన్యముల్ పఱచె నెల్లెడల.
హరిదశ్వుఁబాయని కిరణంబు లనఁగ
వేంకటాద్రీశాది వీరపుంగవులు
రామరాజరుగు మార్గము పట్టి దివికి
వెడలఁ దురుష్కులుఁ వెడలి రుద్దవడిఁ,
గర్ణాటసామ్రాజ్య కవచాయమాన
విద్యాపురీ దుర్గవిధ్వంసమునకు.

♦ ♦ ♦ ♦

అక్కటా! ప్రధ్వస్తమై యింద్రజాల

గంధర్వనగరంబు గతిమాసెఁగాదె!
భరతవర్షీయ శిల్పకళావిలాస
వస్తుప్రదర్శనావని, భారతీయ
విజ్ఞానశత విశ్వవిద్యాలయంబు,
కనుల వైకుంఠంబు, కర్ణాటరాజ్య
లక్ష్మీవిహారస్థలము, హైందవీయ
శౌర్యాగ్నిగోళంబు, శత్రురాజన్య
వీరదుర్ధర్షంబు, విద్యాఘరంబు.
సామ్రాజ్యవర్ధనాశాపిశాచంబు
నావేశమేమిచేయఁగఁ జాలకుండు!
దేశభాషా జన్మదేశమునసంబంధ
ముల విస్మరించి, కేవలమ్మువై జాత్య
వైమత్యముల వేఱుపడి, పరస్పరము
మ్లేచ్ఛులంచును గాఫిరీలంచు దిట్టు
లన్యోన్యనిరసనాయత్తచేతస్కు
లన్యోన్యరాజ్యాపహారణేచ్ఛులగుచుఁ,
దురకలార్యులు నొక్కటఁదరమువారిట్లు
క్షీణులై, స్వాతంత్ర్యహీనులై, దీను
లై, నాఁడునాఁటికి నడఁగిరే కాదె;
కౌటుంబ కలహానఁ గాటొందుటరుదె.

---

౧౫౪౩ లరయతి (చూ. ౭౧౧) కాఫిరి=స్వమతము నవలంబింపని వారి విషయమున నిరసన భావముతోఁ దురుష్కులు వ్యవహరించెడి నామము.

# వీరసింహుఁడు.



## పంచమగుచ్ఛము—ద్వితీయపుష్పము.



క్రూరాస్త్రఘాతాధి రోరుద్యమాన
కుంజరాశ్వమనుష్య ఘోషద్విగుణిత
కాకజంబుక గృధ్ర కంకాదివికృత
ఘోరనిర్ఘోషాతి ఘూర్ణితంబగుచుఁ,
జండఝంఝాప్రభంజన సముత్పాటి
తారణ్యతరు లతాకారవిక్షిప్త
శస్త్రవీరశవౌఘ సంకీర్ణ మగుచు,
శతకోటికృత్త పక్షతిభూమిపతిత
భూధరశతకోటి బుద్ధిప్రదాస్త్ర
దారితస్యందన దంతావళాశ్వ
హతకళేబరగణ వ్యాకీర్ణమగుచు,
శ్రీరామరాజ ధాత్రీలోకపతికి
నూత్రేండ్లు నిండిన యాటాఁగతలము
భువనభయంకరంబుగఁ దోఁచుచుండె.

---

౧౫౫౩ నిర్ఘోషము రోదోభాగమున నిండి యంతటను భ్రమించుచున్న దనిభావము. "గంధర్వయక్షు। గాన ఘూర్ణితమగు నొక్క-కో నగనిరొ" (మను-౨ అ ౧౯ ప).

దీర్ఘనిద్రాయత్త తిమ్మభూమీశుఁ
డఱియుచు నారేయిఁ గొఱవిదయ్యముల
వలెఁ గేలఁ గరదీపికలనూని, కపట
పూరుషు లిద్దఱు పొలిచి, విభ్రాంతి
నలుకుచు నులుకుచుం గళవళంపడుచు
నడలుచు బడలుచు నవియ గుండియలు
వెతఁగూరుచు న్వెక్కివెక్కి యేడ్చుచును
బలవించుచుండెడి పరిదేవితములు
వెలువడె నొకట నిట్టుల నారణోర్వి:
"హాతాత! తిమ్మరాజా! యింక మాకు
దిక్కెవ్వ రీవు నీదీనల న్విడుతె;
అడలుఁగడలి మున్గి బడలు మమ్ములను
దివిచి తేర్పక యిట్లు దిగనాడెదయ్య;
నీదు వైమత్యంబు నీదూరదృష్టి
నరయక యాబేల మరులు దీర్పంగ
వంచించి నిను, వివేకించ కింతేని
యవ్వీరసింహుని హత్యఁ దప్పించి
నీబహిఃప్రాణంబు నీజీవధనము

౧౫౬౭ మాల్యవతీ మరణానంతర మామెచెలు లిద్దఱును నామె వ్రాసిన యాత్మాపరాధసమాధాన లేఖం గైకొని యామె తండ్రి యగు తిమ్మరాజు దరికి వచ్చుచున్నారు. (౧౦౭–౨ పాదము)
౧౫౭౯ చూడు. (౫౨౭–౫౩౩ పాదములు).

ద్రింగుమిత్త్రులను స్వామిద్రోహిణులను
దిగనాడఁదగదె యీధృష్టచిత్తులను;
హా! తండ్రి! ధన్యుండ వైతెల్లగతులఁ;
దనుజాత్మహత్యా నిదానమ్మా నామె
చెఱియాన నైనను జెవిసోకనీక
ప్రాపించి యిపుడు వీరస్వర్గగరిమ;
ఐహికస్థితియేడ! యయ్యొ! నీవేడ!
యుఱుమనిపిడుగు నా నుఱుమాడకున్నె
౧౭౮౦ మాల్యవతీ సుతా మరణదుర్వార్త.”
వెడమూర్ఛ నటనుండు వీరసింహునకు
నత్తఱి నగ్నితప్తాయశ్శలాకఁ
జెవిసూఁడినట్లు గాఁగ, వడంకుగదుర,
నదరుపాటునలేచి యశేఁడు, వారలను
గుఱితించి, విభ్రాంతిఁగొని, సమీపించి,
జముఁడంపు పరమాన చాడ్పున నచటఁ
బడియున్న చెలికమ్మ వడిఁదీసి చదివి
ప్రిదులంగ హృదయంబు, వీనుల న్వ్రేఁడి

౧౭౭౬ చూడు. ౧౦౧౨ పాదము.

౧౭౮౬. ‘పరమానా’ అనిశబ్దరత్నాకరము. ,నచదేశ్యపదే’ అనుచోష్పున హ్రస్వము రాఁజనరాదు. “ ‘చక్కెరబ్బాణము తేజిఁదోలు’ నిత్యాదౌతేజ్యాది శబ్దానాం (దేశ్యానామ్) హ్రస్వోనవిరుద్ధ ఇత్యవగంతవ్యమ్” (అహో. 303 పుట.)

గాడ్పులు వెడలంగఁ, గనులఁజీఁకట్లు
క్రమ్మ, నుమ్మలికఁ గ్రక్కున కూలఁబడియె
నదరి యచ్చటి పూరుషాకృతుల్ గలఁగ.
గాటంపు దుఃఖంపు గాఢాగ్ని కాఁకఁ
దద్ధైర్యశైలంబు ద్రవియించి పొంగె
నన నక్షిగోళంబులను బాష్పజలము
క్రమ్మ ప్రమాన్పడియుండె గడెసే పతండు.
ఎట్టకేలకుఁ దేఱి యెద మాల్యవతిని
దలఁచుచుఁ దలఁచుచుఁ బలవించెనిట్లు:
హా! మదేకావలంబాత్మోహాలోక!
హా! మదీయప్రాణ హాతిశంకితాత్మ!
హా! గూఢగుప్త మత్ప్రాణాభిమాన!

---

౧౬౦౪ పైపూరుషాకృతుల ప్రసంగము (౧౫౪౪ పాద) వలనను ప్రణయలేఖావిషయముల వలనను వీరసింహునకు మాల్యవతీ మరణకారణాది వృత్తాంతమెల్ల గోచరించెను. అంతతోనాతఁడు స్వీయప్రాణత్యాగమునఁ గృతనిశ్చయుఁడయ్యె. అట్టియవస్థలో నాతనికి, వెనుకఁ దానైహికస్థితిలో నందఁగోరిన సుఖాదివిషయకప్రసంగములెల్ల స్మృతిగోచరములు కాసాగెను. విసదృశానుభవము సయితము స్మరణమున నుద్బోధకమగునుగదా.

౧౬౦౯ }
౧౬౧౦ } చూడు. ౧౫౨౪-౧౫౩౩ పాదములు.

హా! మదీయావన త్యక్తాత్మజీవ!
వ్రయ్యలై తుమురులై పడిపోదు నాదు
పాపిష్ఠహృది యెట్టి వజ్రపంజరమొ!
త్వద్ఘోరవృత్తాంత వజ్రపాతములఁ;
హా! మానధన! తృణప్రాయంబు గాఁగఁ
బ్రాణంబు వెచ్చించి మానంబె కొంటె?
ఆరూప మాకాంతి యవ్విలాసంబు
వీరసింహునకయి వితసేసికొంటె.
మృత్పిండమతి నోట నించుకేనరయ
౧౬_౨౦ లే కేమఱిల్లితిఁగాక; యాకటికి
మొఱకు సుల్తానేడ! చెఱఁబాపుటేడ!
వెనువెంట నాతపస్విని కమ్మయేడ!
దౌర్భాగ్యదావాగ్ని దందహ్యమానుఁ
డీ వెడఁగునకయి యింతసాహసము
కావించి డాఁచితే గంభీరహృదయ!.
ఇంత మూఁడుటఁగాదె వంతలంగూరి
చలియించె నారీతి నలనాఁడు మనము.

---

౧౬_౧౧ చూ. ౧౦౪౮ పాదము. మొ ౧౦౬౩_౧౦౬౮ పాదములు.
౧౬_౧౫ చూ. ౧౩౧౬-౧౦౮౬-౧౦౭౦-౧౦౭౧ పాదములు.
౧౬_౧౬ చూ. ౧౩౧౭-౭౧౫-౭౧౬ పాదములు. ౭౧౨-౭౧౩ పాదములు.
౧౬_౧౯ చూ. ౪౯౬-౪౯౪ పాదములు.
౧౬_౨౨ చూ. ౭౦౮_౭౦౫ పాదములు.
౧౬_౨౮ చూ. ౧౦౬౫-౧౦౪౩ పాదములు.
౧౬_౨౬ } చూ. ౧_౨౦౭ మొ. ౧_౨౩౯ పా. ౧_౨౩౫-౧_౨౩౬. పా.
౧౬_౨౪ }

హా! దుర్విధీ! తాదృశామేయకల్య
సుగుణ కల్పకవల్లి సుదతీమతల్లి
సృజియించి తోడ్తోన ఛేదింప నెట్లు
చేయాడె; నీకు నౌచిత్యంబె! కృపయె
గాఢానురాగంబు గలిగింప నేల?
బంధు మిత్రుల నెడఁ బాపంగ నేల?
రూపలావణ్యముల్ చూపింప నేల?
నైష్ఫల్యమున వాని నలఁగింప నేల?
గర్వధూర్వహాలక్ష్మి గలిగింప నేల;
చాంచల్య మిడి దాని సమయింప నేల;
విజయవిక్రమముల వెలిఁగింప నేల;
అపజయం బిడి దాని నడఁగింప నేల;
మతిఁదప్పి యిటునే విమర్శింతుఁగాక
వెడఁగుచెయ్వుల కింత విసుమాన మేల?
కల్పభూజముఁ బోని కర్ణాటరాజ్య
మొకవ్రేల్మిడిని నిట్లు పెకలింపలేదె!
రాజదేవాధీశు రామభూమీశు
శత్రుదురాధర్షు శశ్వజ్జిగీషు
నరిచేతి కందించి యడఁగింపలేదె!
అంకురించి చిగిర్చి యలరించి మిగుల
దీపించు మాల్యవతీ వీరసింహా
రాగకల్పకవల్లి యీగతిన్ విఫలి
తంబుగాఁగ జయధ్వజం బెత్తలేదె!.

కోటి కోర్కెలుండేని కొనసాగెనయ్య!
పెరిఁగి తోడ్తోడనే విఱుగఁగకుండంగ.
చిన్ననాఁటనె బందె, పితృవియోగంబు,
భ్రాతృదుర్మరణంబు, బంది బంధంబు,
ప్రాణేశ్వరీహత్య, ప్రభువినాశంబు,
నిఖిలాత్మ సంకల్ప నిర్మూలనంబు,
వీరసింహుఁడ నీ విభవంబులెట్లు!
నీభాగ్యవిభవాననేగాదె తాదృ
గరిదురాధర్ష విద్యాపురాఖండ
సామ్రాజ్య మకట! యస్తమితంబ యయ్యె.
ఆకాశసౌధ విహారంబుసేయ
నీవన్న సంకల్ప సోపానపంక్తి
ప్రతికూల విధిగాలి వాన నీసారి
నిర్ధూతమే యాట నిక్కంబయయ్యె.
కడగండ్లు తోలుదోల్తఁగల్పించి పిదప
విధి నిన్ను సృజియించె, వేయు నింకేల
నిహతాఖిలాశుండ! నిష్ఫలేహుఁడ....
ఔరా! విద్యాపురాధీశనాక

౧౬౫౪ పూర్వార్ధస్మృతి—ఇయ్యదియు నైసాదృశ్యమునఁ గల్గినదియె చూడుఁడు. ౧౯౨-౧౯౩-౧౯౪. పా.

౧౬౬౧ | ౧౬౬౪ వెనుక వీరసింహుఁడు చెఱలోనున్నప్పుడును నిట్లనుకొనెను. (౭౩౯-౭౪౨-) కాని యపుడు నిక్కముకాలేదు. ఈసారి నిక్కమయ్యెనని భావము.

౧౬౬౭ ఈహా=ఉద్యమము.

లలనాస్వయంగ్రాహ లగ్నంబెనాకు
శుభము చేకూర్చెడు సుముహూర్త మయ్యె;
హతవిధికై యింత యడలంగనేల?
జానుదఘ్నం బబ్ధి సాహసాంకులకు.
బంధుమిత్రవిహీన వసుమతీలోక
సంగంబు నాకేల? సౌఖ్యంబదేల?
విక్రాంతులింకేల? విజయంబదేల?
విమతియౌ విధితోడి విద్వేషమేల?
మృత బంధుమిత్ర సంగతి గూర్చుదాని,
మాల్యవతీసతీ మహితమౌదాని,
నిశ్చంచల శ్రీల నెగడొందుదాని,
శాశ్వతానందంబు సమకూర్చుదాని,
శూరాగ్రణీగమ్య సురరాజధానిఁ,
బ్రాపింతు నిహసౌఖ్యవైముఖ్య మూని.

---

౧౬౬౯-౧౬౭౦ ప్రకృతమున రామరాయల, నాకలలనాస్వయంగ్రాహకాలము తనకును మరణకాలమగుటచే, వెనుకఁ దాను మాల్యవతితోఁ బల్కిన మాల్యవతీప్రాప్తశుభముహూర్తకాలప్రసంగము స్మృతికివచ్చెననియెన్నదది. (చూ. ౪౪౪_౪౪౬ పాదములు. ౭౩౫-౭౪౪ పాదములు).

౧౬౭౧-౨ చూ. ౯౭౫-౯౭౬ పాదములలోని మాల్యవతీ ప్రసంగమును స్మరించి యిట్లు పల్కుచున్నాఁడు.

ప్రియసఖి, శేదవహ్యో హిరహార్గి గలిగి;
క్షమియింపు విశ్వసింపుము చెలీ వీని.
ఇదె మాల్యవతి సాధ్వి యీవీరసింహుఁ
డీ దేహ మసి యోష కిడి దివ్యదేహ
మునని న్ను సేవింపఁ జనుదెంచువాఁడు;
చేపట్టుమా వీని శ్రితకల్పవల్లి.

♦ ♦ ♦ ♦

---

౧౬౭౩ } ౯౨౨-౯౨౩ పాదములు స్మరణమునకురాఁగా నిట్లు
౧౬౭౪ } పల్కుచున్నాఁడు.

౧౬౭౩-౧౬౭౪ చూ-౬౫౦-౬౫౧ పా.

౧౬౭౫ ,,సతీచ సాధ్వీ ప్రకృతిః స్థిరాపి పుమాంస మభ్యేతి భవాంతరేష్వపి"
(కాళిదాసు) 'శ్రితకల్పవల్లి' యనుటచే గ్రంథాంత మంగళ
మాచరింపఁబడెను. (చూ. ౧-౭౮౮ పాదములు).



రామమోహన ప్రెస్, రాజమండ్రి:—1936